# కట్టా వరదరాజకవి
## ద్విపదరామాయణము - ఒక పరిశీలన



డా॥ కడియాల వెంకటరమణ
తెలుగు అధ్య. యనశాఖ
శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతి

1998



# గంగా రామాయణాం[illegible]

## హనుమద్వి యము
## రగడ కావ్యము


కృతికర్త
కవిశేఖర
గ గా రాజేశ్వరరావు, M.A.B.Ed.





"THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTHANAMS UNDER THAIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ప్రచురణ
గంగా తరంగిణీ సారస్వత సమితి
మంథని.

## అంకితం

తల్లిదండ్రులు
శ్రీ కడియాల రెడ్డెప్పనాయుడు,
శ్రీమతి నారాయణమ్మలకు
భక్తితో....

# కైమోడ్పు

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థలో డా॥ కె. జె. కృష్ణమూర్తిగారి దగ్గర పరిశోధన విద్యార్థిగా ఏప్రిల్ 1986 నుండి కావించిన పఠన పరిశీలనముల ఫలితరూపమే ఈ పరిశోధక వ్యాసం. నా పరిశోధనకు పర్యవేక్షణ బాధ్యతను స్వీకరించి ప్రతిచిన్న విషయంలోను సలహాలను, పుస్తకాలను ఇచ్చి, నా పరిశోధనను పూర్తిచేయించిన సహృదయులు డా॥ కె. జె. కృష్ణమూర్తి గారికి ............................

నా పరిశోధనకు విశేషంగా తన సలహాలు, సూచనలు యిచ్చి తోడ్పడిన గురువర్యులు డా॥ జి. దామోదర నాయుడు గారికి ..........

నాపట్ల, నా పరిశోధనాంశంపట్ల ఉన్న అభిమానంతో తమ అమూల్యమైన సమయాన్ని కేటాయించి నాపరిశోధన వ్యాసరచనకు సహకరించిన సహృదయులు కీర్తిశేషులు విద్వాన్ శ్రీ డి. నాగసిద్దారెడ్డిగారికి .........

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయనశాఖలోని నాగురువర్యులెల్లరకు ..............

పరిశోధన కవసరమగు వ్రాతప్రతులను సంప్రదించుట కనుమతించిన సహృదయులు ప్రాచ్యపరిశోధన సంస్థకు డైరెక్టరుగా నుండిన కీ.శే. డి. శ్రీధరబాబుగారికి, అట్లే ప్రస్తుత డైరెక్టర్ ఆచార్య యం. శ్రీమన్నారాయణ మూర్తి గారికి, పైసంస్థ యందలి ఉద్యోగి బృందమునకు, గ్రంథాలయ సిబ్బంది, అందరకు .....................

అడిగినదేతడవుగా అప్యాయతతో ఆవశ్యకమైన పుస్తకములను అందించిన శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ గ్రంథాలయ తెలుగు విభాగ సంరక్షణాధికారి శ్రీషణ్ముగంగారికి కృతజ్ఞతాంజలులు.

ఈ పరిశోధనా వ్యాస రచనలో విశేషంగా సహకరించిన నా శ్రీమతి రజనికి - అభినందనలు.

డా॥ కె. వెంకటరమణ

ఎంతో విశిష్టతను పొందిన కట్టావరదరాజ కవి ద్విపద రామాయణాన్ని డా॥ కడియాల వెంకటరమణ ఐదు ప్రధాన భాగాలుగా విభజించి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి డాక్టరేట్ పట్టాకోసం సమర్పించి పట్టాను పొందాడు.

పరిశోధకుడు వరదరాజ కవి జీవిత విశేషాల్ని, ఆకవి కృతుల్ని మొదట వివరించాడు. తరువాత తాను పరిశోధనకు స్వీకరించిన గ్రంథము యొక్క అనువాద విధానాన్ని చాలా సూక్ష్మంగా, సవివరంగా చర్చించాడు. ఈ భాగంలోని ఒక్కొక్క కాండను విడి విడిగా మూలంతో పోల్చి చూడడం రమణ నిశిత పరిశీలనకు నిదర్శనం. ఆతర్వాత విభాగం పరిశోధకుని సాహితీ శక్తిని తెలియ జేస్తుంది. అది వరదరాజు కవితా వైశిష్ట్యాన్ని గూర్చిన విషయం. దీనిని రమణ పాత్రచిత్రణ, వర్ణన, రసపోషణ, శైలీవిన్యాసం మొదలైన అంతర్భాగాలుగా వింగడించి పాఠకులకు వరదరాజుకవితా వైశిష్ట్యాన్ని చక్కగా అందించాడు. వరదరాజు భాషా విశేషాల్ని గూర్చి ఒక విభాగం పెట్టుకొని అందులో జాతీయాలు, సామెతలు, లోకోక్తులు, శబ్దవిశేషాలు అని అనేక విధాలుగా పరిశీలించాడు.

శ్రీ కడియాల వెంకటరమణ ప్రస్తుతం తెలుగు అధ్యయన శాఖలో గత ఐదు సంవత్సరాలుగా రీసెర్చి సైంటిస్ట్‌గా పని చేస్తున్నాడు. అంతకు మునుపు యిదే శాఖలో యం.ఏ. తెలుగు పట్టాను 1985లో పొందాడు. తరువాత ఆచార్య కె.జె.కృష్ణమూర్తి అధ్వర్యంలో "కట్టా వరదరాజ కవి ద్విపద రామాయణం - ఒక పరిశీలన"అనే అంశంపై డాక్టరేట్ పట్టాను పొందాడు. ఇంతకు మునుపే "సృష్టిపై చలం ఆలోచనలు - ఒక విమర్శ, పరమ భాగవత చరిత్రము అనే పుస్తకాల్ని ముద్రించి వుండడం గమనార్హం. అందులో "సృష్టిపై చలం ఆలోచనలు - ఒక విమర్శ" అనే గ్రంథం రమణ సమాజాన్ని ఎంత చక్కగా అధ్యయనం చేశాడో సాహిత్యంతో పాటు సమాజాన్ని కూడా ఎంత నిశితంగా పరిశీలించాడో అభివ్యక్తమవుతుంది.

ప్రస్తుత గ్రంథం రమణ పరిశీలనా దృష్టికి ఒక ఉదాహరణ. నిగ్రహమే కాని ఆగ్రహ మెరుగని రమణ జీవితంలో యింకా పైమెట్లు అధిరోహించాలని, సమాజానికి పనికి వచ్చే మరిన్ని గ్రంథాలు వెలువరించాలని మనసా ఆకాంక్షిస్తున్నాను. ఇందుకు రమణకు ఆయురారోగ్యాల్ని, సాహితీ సంపత్తును ప్రసాదించాల్సిందిగా తిరుమల వేంకటేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

తిరుపతి,
12-10-'98.

డా॥ జి. డి. నాయుడు
తెలుగు అధ్యయన శాఖ,
యస్.వి.యు. తిరుపతి.

# విషయ సూచిక

వరదరాజు క్రీ.శ. 17వ శతాబ్దివాడని చెప్పడానికి, ఇతని శ్రీరంగ మాహాత్మ్యము నుండి క్రింది పద్యాన్ని గణపవరపు వేంకటకవి తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమున ఉదహరించి యుండటం.

"మ. ఎక తాళంబున వీరమద్దెలరవం బేకంబుగా నట్టువల్
ధికతోంతత్తక ఝుంకుఝుంకు కిణుతాంధిత్తాంగి నాలోధికం
ధికతెత్తెయ్యధి ధిక్కు ధిక్కు ధికతా దిక్తాది తాళంబులన్
కకుబంతంబుల మాఱుబల్కు కొనగోల్కశ్యంద మున్నాడగన్".

- ప్రబంధరాజ వేం. వి. విలాసము, 14 ఆశ్వా, 161ప

గణపవరపు వేంకటకవి క్రీ.శ. 1674 ప్రాంతంలో తంజావూరిని పరిపాలించిన మధురనాయకరాజగు ముద్దళగిరికి ఆశ్రితుడుగా ఉండెను. ఇతడు రాజుకు అంకితంగా విద్యావతీదండకాన్ని రచించినాడు.[7] ఈ కవి 17వ శతాబ్ది ద్వితీయార్థమందున్న వాడు. వరదరాజు గ్రంథమునుంచి యీతడు పద్యాన్ని గ్రహించటంవల్ల వరదరాజు 17వ శతాబ్ది మధ్యనున్న వాడని నిశ్చితంగా చెప్పవచ్చును.

## 1.3 కృతుల సమీక్షణ :

వరదరాజు వైష్ణవమతాభిమాని. శ్రీ వేంకటేశ్వరుడు ఈతని ఇష్టదైవం. ఇతడు తనరచనలన్నింటిని శ్రీ వేంకటేశ్వరునికే అంకితమిచ్చాడు. ఇతని కవిత్వం మనోహరం, మాధుర్య గుణపూరితమై వుంటుంది. సులభమైనశైలి, మెత్తని మాటలు, నిరాఘాటమైన ధారాశుద్ధి కలిగి ఇతని కవిత్వం చదువ చదువ చవులూరుచుండును.

రచనలు - సమీక్ష - ఈకవి రచనలివి.

(1) పరమ భాగవత చరిత్ర.

(2) శ్రీరంగ మాహాత్మ్యము.

(3) శ్రీ రామాయణము.

మొదటి రెండూ పద్యకావ్యాలుకాగా మూడవది ద్విపద.

### 1.3.1 పరమ భాగవత చరిత్ర

ఇది ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. ఇందులో 14 మంది పరమ భాగవతుల కథలు కలవు. ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, భీష్మ, దాల్భ్యాయన, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణులనే వారు ఈ పరమ భాగవతులు. అయితే 8 ఆశ్వాసాల ఈ ప్రబంధంలో పుండరీక చరిత్ర, రుక్మాంగద చరిత్ర

వరదరాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణ శతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము. "[12]

గరుడ పురాణంలోని శతాధ్యాయిని శ్రీరంగ మాహాత్మ్యంగా తెనిగించమని, శ్రీ వేంకటేశ్వరుడు వరదరాజుకు ఇలా ఆదేశించాడు.

"చేయరె తొల్లిసత్కవుల శేషపురాణములన్ దెనుంగునం
దీయితిహాస మెందురచియింపమి తావక పుణ్యమెంతయా
మ్నాయ చతుష్కసారము సనాతనగారుడసంహితా శతా
ధ్యాయి దెనుంగు సేయనొకడర్హుడె నేటికవీంద్ర కోటిలోన్."

- శ్రీరంగ మాహాత్మ్యము. 1 ఆశ్వా, పుట. 6.

అయితే ఈ కవికంటె ముందు ముగ్గురు కవులు శ్రీరంగ మాహాత్మ్యాన్ని తెలుగులో రచించారు. ఈ విషయం వరదరాజుకు తెలిసియుండక పోవచ్చు. చెన్నమల్లు శ్రీగిరన్న, భైరవుడు అనేకవులిద్దరు శ్రీరంగ మాహాత్మ్యాన్ని పద్యకావ్యంగా వ్రాశారు. ముకుందయోగి ద్విపదగా చెప్పాడు.

శైవుడైన శ్రీగిరి, శ్రీరంగ మాహాత్మ్యమునే కాక నవనాథ చరిత్ర పద్యకావ్యాన్ని, శ్రీగిరి శతకాన్ని రచించాడు.[13] ఇతడు నవనాథ చరిత్రను ద్విపదగా వ్రాసిన గౌరనకు పూర్వుడు. గౌరనతన ద్విపద కావ్యంలో ఈతని పద్య కావ్యాన్ని పేర్కొన్నాడు. శ్రీగిరికాలం క్రీ. శ. 13వ శతాబ్దం.

రెండవకవి భైరవుడు. ఇతడుకూడా శైవుడే. ఇతడు శ్రీరంగ మాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిగజాంకుశము అనే గ్రంథాలను రచించాడు. ఇతని రచనలన్నీ ముద్రితమైనవి. ఈకవి 14వ శతాబ్దం వాడు.

శ్రీరంగ మాహాత్మ్యమునందలి కవితారచనను గురించి శ్రీరామకృష్ణకవిగారు తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తంచేశారు.

"భైరవుండును విప్రకవియు శ్రీరంగ మాహాత్మ్యమును రచియించెను. దుష్టకవి ఘోరపిశాచముల నదల్చు గురుభైరవుండగు భైరవుని కవితా ప్రవాహమున కిక్కవి వాక్పుష్పదామములు నిలువజాలకున్నను, వర్షాంతపు నదివోలె నదినీరసమగుచుండ నిత్యపరిమళశోభితంబగు వరదరాజ కృతి సరసమై పండిత భృంగముల కాకర్షణ యంత్రమువలె నున్నది. "[14]

పెదతల్లి కుమారు'డని వ్రాసియున్నారు. అయితే కీ.శే. చెలికాని లచ్చారావుగారు చెప్పినట్లు వారు దానికి ఆధారాలు చూపలేదు. అయినను కవిగారి వాక్యాల్ని అంగీకరించి వరదరాజు క్రీ.శ. 16వ శతాబ్దం కడపట ఉండినవాడని నిశ్చయించారు.

"వరదరాజు శ్రీమానవల్లి కవిగారు చెప్పినట్లు రామరాజు బందుగుడైనచో తప్పక 16వ శతాబ్దం కడపటివాడగును ............ పైగా ఆముక్త మాల్యద పోలికలుండుటచే ఇతడు 16వ శతాబ్దము కడపటి భాగమునకే యుండి యుండవచ్చును."[2]

అయితే ఈ కాలనిర్ణయం అంగీకరించుటకు వీలులేదు. వరదరాజు క్రీ.శ. 17వ శతాబ్ద పూర్వార్ధములో ఉండెనని చెప్పడానికి ఆతని గ్రంథములందే ప్రబలమైన సాక్ష్యం కనపడుతున్నది.

కవి తన ద్విపద రామాయణ కృత్యవతారిక యందు తనవంశాన్ని వర్ణిస్తూ ఇట్లు చెప్పినాడు.

"పరవధూ ద్రవ్య - చాపల్యదూరుండు
హరిదాసరాజైన - హరిదాసరాజు
అంగనాభూషణం-బగు పోచిరాజు
సింగరి రాజన్య - శేఖరుసుతను
బాళిమై కృష్ణమాం-బను వరియించె
నాలేమతోఁబుట్టు-వగు నోబమాంబ
అర్థి శ్రీరంగరా-యలు నాల్గుపూరు
షార్థముల్ గలుగఁగ-ల్యాణమై మించె
ఆయశోనిధిసుతుం-డై రామదేవ
రాయలు మారట - రాముఁడై వెలసె
హరిదాసరాజు కృ-ష్ణాంబయందులను
హరిసుదర్శనమూర్తి-యగు రామరాజు
రాజ భగీరథు - రవితేజు వరద
రాజును నిను దాత - రాయనిఁగాంచె,
రచియింపు మీవు శ్రీ-రామాయణంబు"[3]

సీతాన్వేషణలో పర్యవసానమునకై నిరీక్షించుచున్న రాముని యెదుట
హనుమంతుడు నిలిచి మొదటగా-

"చూచితి సీతను-వేచి చూచు
నీమార్గము-వేయికనులతో జనకజ"

అనుటలో రామునకు సత్వర సంతోము చేకూర్చబడినది.

సుందరకాండముగా పిల్వబడు యీగాధకు సుందర నామ నిర్వచనము.

అతి సుందరముగా శ్రీరాజేశ్వరరావుగారు యిచ్చి యున్నారు.

"సుందరము శివము రాముని తత్వము
సుందరత నిధికి సీతాభాండము
సుందరచారిత్రుడు హనుమంతుడు
సుందరత్రయము సుందరకాండము"

సంక్షిప్తముగా వ్రాయుట మే కాని శ్రీరాజేశ్వర రావు గారి కవిత
మాధుర్యము ఎంత చవి చూచినా అంతులేనిదిగా వున్నది. వారికి శ్రీరామచంద్రుడు
ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక

**యడవల్లి పట్టాభి రామశాస్త్రి**

మచిలీపట్నము, ద్వారకామాయి.

"దాశరధాయ విద్మహే సీతావల్లభాయ దీమహి
తన్నో రామచంద్రః ప్రచోదయాత్"

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం! ఆరుహ్యాక వితాశాఖాం- వందే వాల్మీకి కోకిలాం.

పుంసాంమోహనరూపుడగు రాముని చరితము ఆదికవి విరచితమై శ్లోకరూపమున విలసిల్లియున్నది. కుశలవులచే వాల్మీకి ప్రేరణతో గానము చేయబడినది. శతకోటిప్రవిస్తరమగు రామకథ అనల్ప ప్రతిభాశాలురగు మహాకవులచే యనువదింపబడి యనేక భాషలలో తలమానికమై విలసిల్లుచున్నది. భాస్కరుడు మొదలుగ అనేక కవులు విభిన్న రీతులలోవ్యక్తీకరించి యశము నందిరి. ఏనోట విన్నా ఎన్నాళ్ళు విన్నా నిత్య నూతనమై భాసించు రామకథ శ్రీగంగా రాజేశ్వరానూదితమై విభిన్న గర్భ వృత్తములతో దేశీ ఛందస్సుల రగడలతో సాగి గాన యోగ్యమై శ్రవణపేయమై శబ్దార్థాలంకార శోభితమై జాతీయములచే సామెతలచే సంయోజితమై కొనసాగినది.

బహు గ్రంధ నిర్మాతగా పేరు గాంచిన బహు బిరుదావళీభూషితులగు కవిగారి రచనా వైశిష్ట్యము విభిన్న సాహితీప్రక్రియలకు నిలయమై గంగాతరంగిణీ చలన చాలిత మధురనాదబిందు నిష్యందమై సుధామధురమై పాఠకులకు ఆనందము గొల్పగల దనుమాట పునరుక్తమే. వార్ధక్య మావహించినను వారి ప్రతిభా సమన్విత మగు దీక్ష దక్షత రామకథ పగిది అనంతమై అనే కానేక రచనలకు దోహద కారి కాగలదని సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడగు శ్రీరామ కృపాకటాక్షమున సంపూర్ణ రచన సిరీతినే సాగిస్తారని ఆశిస్తున్నాను .

ఇట్లు
**ఉత్తలూరు రామానుజాచార్యులు**
విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు
మంచిర్యాల.

వరదరాజు క్రీ. శ. 17వ శతాబ్దివాడని చెప్పడానికి, ఇతని శ్రీరంగమాహాత్మ్యము నుండి క్రింది పద్యాన్ని గణపవరపు వేంకటకవి తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమున ఉదహరించి యుండటం.

"మ. ఏక తాళంబున వీరమద్దెలరవం బేకంబుగా నట్టువల్
ధికతోంతత్తక ఝుంకుఝుంకు కిణుతాంధిత్తాంగి నాలోధికం
ధికతెత్తెయ్యధి ధిక్కు ధిక్కు ధికతా దిక్తాది తాళంబులన్
కకుబంతంబుల మాఱుబల్కు కొనగోల్కాశ్యంద మున్నాడగన్".

- ప్రబంధరాజ వేం. వి. విలాసము, 14 ఆశ్వా, 161ప

గణపవరపు వేంకటకవి క్రీ. శ. 1674 ప్రాంతంలో తంజావూరిని పరిపాలించిన మధురనాయకరాజగు ముద్దళగిరికి ఆశ్రితుడుగా ఉండెను. ఇతడు రాజుకు అంకితంగా విద్యావతీదండకాన్ని రచించినాడు.[7] ఈ కవి 17వ శతాబ్ది ద్వితీయార్థమందున్న వాడు. వరదరాజు గ్రంథమునుంచి యీతడు పద్యాన్ని గ్రహించటంవల్ల వరదరాజు 17వ శతాబ్ది మధ్యనున్న వాడని నిశ్చతంగా చెప్పవచ్చును.

## 1.3 కృతుల సమీక్షణ :

వరదరాజు వైష్ణవమతాభిమాని. శ్రీ వేంకటేశ్వరుడు ఈతని ఇష్టదైవం. ఇతడు తనరచనలన్నింటిని శ్రీ వేంకటేశ్వరునికే అంకితమిచ్చాడు. ఇతని కవిత్వం మనోహరం, మాధుర్య గుణపూరితమై వుంటుంది. సులభమైనశైలి, మెత్తని మాటలు, నిరాఘాటమైన ధారాశుద్ధి కలిగి ఇతని కవిత్వం చదువ చదువ చవులూరుచుండును.

రచనలు - సమీక్ష - ఈకవి రచనలివి.

(1) పరమ భాగవత చరిత్ర.

(2) శ్రీరంగ మాహాత్మ్యము.

(3) శ్రీ రామాయణము.

మొదటి రెండూ పద్యకావ్యాలుకాగా మూడవది ద్విపద.

### 1.3.1 పరమ భాగవత చరిత్ర

ఇది ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. ఇందులో 14 మంది పరమ భాగవతుల కథలు కలవు. ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, భీష్మ, దాల్భ్యాయన, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణులనే వారు ఈ పరమ భాగవతులు. అయితే 8 ఆశ్వాసాల ఈ ప్రబంధంలో పుండరీకచరిత్ర, రుక్మాంగదచరిత్ర

ఓం శ్రీ సాయిరాం

బహుగ్రంధకర్త, లబ్ధప్రతిష్ఠులు బ్రహ్మ శ్రీ గంగారాజేశ్వరరావు గారు రచిం సుందర కాండము చూచేభాగ్యము కలిగింది. ప్రవాహ వేగంతో సాగిపోయే కావ్య అలవోకగా చదవడానికి అనువైనది. వివిధ ఛందస్సులలో వ్రాసిన రామాయణ అనేకములున్నాయి. రగడలో వ్రాసిన రామాయణ భాగమిది ఒకటే నేమో!

అసలు సుందర కాండము సుంద. తమమైనది. ఆపాత మధురమై వాల్మీకి రామాయణములో సుందర కాండము మధురాతి మధురమై రాజిల్లినది మాధుర్యాన్ని తెలుగులో చూపడానికి అనేకులు ప్రయత్నించారు. కాని కృతార్థులు పోయారు.

ఆధునిక కాలంలో సాంప్రదాయ బద్ధమైన మహాకావ్యాలు చదివే కరువయ్యారు. రామాయణభాగాన్ని సులభ సాధ్యము చేసి మామూలు పాఠక చదివించేట్లు చేశారు.

ఈకావ్యముద్వారా....

వీరి అమరలేఖిని నుండి రామాయణమంతా ఈరీతిలో రా బహుళప్రచారము పొందాలని ఆశిస్తున్నాను.

ఇట్లు

పచ్చిపులుసు వేంకటేశ్వర్ల

ఎమ్.ఏ.(తెలుగు), ఎమ్.ఏ.(పొలి

బి.ఇడి.వి శారద, నెల్లూరు.

# గంగా తరంగిణీ సంక్షిప్త వివరం- నూతన సంస్థ

ఈ సంస్థ కవి శేఖర బ్ర.శ్రీ.గంగా రాజేశ్వరావుగారిచే 17వ అక్టోబరు 1985న స్థాపింపబడి దాదాపు 10 సం॥రముల దనుక శ్రీవారు సంస్థ కార్య క్రమాలను నిర్వహించారు. నాటనుండి ఈ సంస్థకు మార్గదర్శకులు మాజీ M.L.C. శ్రీ గిట్ల జనార్ధనరెడ్డి గారే, ఈ సంస్థ ఒక చక్కని సుస్థిర కార్య వర్గము గల సంస్థ.

నాడు ఈ సంస్థ 10 మంది సభ్యులతో వెలసి శ్రీ.ఇల్లెందుల సత్యనారాయణ గారి అధ్యక్షతన పెక్కు కార్య క్రమాలు నెరపుకున్నది. సాహితీ సమావేశాలు; కవి సమ్మేళనలు; కవితాగోష్టులు, అముద్రిత రచనల ముద్రణా కార్య క్రమం దాతల సహకారంతో; సాంస్కృతిక కార్య కలాపాలు, వార్షికోత్సవాలు; కవి పండితుల ప్రసంగాల నిర్వహణ; సన్మాన సత్కారాలద్వారా సాహితీ సేవ: స్థానిక యువ కవుల వివిధ ప్రక్రియల పోటీల ద్వారా వారి ప్రతిభను ప్రోత్సహించుట; మెదలగు కార్యక్రమాలు ఈ సంస్థ ద్వారా నిర్వహింపబడు చున్నవి.

ఈ సంస్థ స్థాపించిననాడు మెదలుకొని 10 సంవత్సరాల లగాయతు కొంత కాలము ప్రధాన కార్యదర్శకత్త్వము డా॥ శు క శ్రీగారును, ఆపై శ్రీ కాకుటూరి సుబ్రహ్మణ్యం గారును నిర్వహించారు.

1994లో సంస్థలో క్రొత్త మలుపు ఏర్పడివ్యవస్థాపకులు,మార్గదర్శకులు సూచనలతో ఒక సుస్థిర నూతన కార్య వర్గమేర్పడింది. అందు 1. వ్యవస్థాపక అధ్యక్షుడు. 2. మార్గదర్శి; 3. కార్య నిర్వాహక అధ్యక్షుడు 3. ఉపాధ్యక్షుడు 4. ప్రధాన కార్యదర్శి 5. సంయుక్త కార్యదర్శి 6. ఆర్థిక కార్యదర్శి గా రూపొందింది. ఇలా రూపొందిన ఈ సంస్థ.

వ్యవస్థాపక అధ్యక్షులు - "కవిశేఖర" గంగా రజేశ్వర రావు

మార్గదర్శకులు - శ్రీగిట్ల జనార్ధన రెడ్డి

1. కార్యనిర్వాహక అధ్యక్షు - శ్రీ. రేగళ్ళ మురళీధర శర్మ
2. ఉపాధ్యక్షులు - శ్రీ గిట్ల రమణా రెడ్డి
3. ప్రధానకార్యదర్శి - శ్రీకాకుటూరి సుబ్రహ్మణ్యం
4. సంయుక్త కార్య దర్శులు - శ్రీ. వాన మామలై నరసింహాచార్యులు; శ్రీ బండారి సత్యనారాయణ; శ్రీ తాటి కొండ రాజగౌడు.
5. ఆర్థిక కార్యదర్శి - శ్రీ గట్టు నరసింహ ప్రసాద్.
6. హితవరులు - శ్రీ మాదాడి ప్రభకర రెడ్డి; శ్రీ చెప్యాల రామకిషన్‌రావు.

వరదరాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణ శతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము. "[12]

గరుడ పురాణంలోని శతాధ్యాయిని శ్రీరంగ మాహాత్మ్యంగా తెనిగించమని, శ్రీ వేంకటేశ్వరుడు వరదరాజుకు ఇలా ఆదేశించాడు.

"చేయరె తొల్లిసత్కవుల శేషపురాణములన్ దెనుంగునం
దీయితిహాస మెందురచియింపమి తావక పుణ్యమెంతయా
మ్నాయ చతుష్కసారము సనాతనగారుడసంహితా శతా
ధ్యాయి దెనుంగు సేయనొకడర్హుడె నేటికవీంద్ర కోటిలోన్."

\- శ్రీరంగ మాహాత్మ్యము. 1 ఆశ్వా, పుట. 6.

అయితే ఈ కవికంటె ముందు ముగ్గురు కవులు శ్రీరంగ మాహాత్మ్యాన్ని తెలుగులో రచించారు. ఈ విషయం వరదరాజుకు తెలిసియుండక పోవచ్చు. చెన్నమల్లు శ్రీగిరన్న, భైరవుడు అనేకవులిద్దరు శ్రీరంగ మాహాత్మ్యాన్ని పద్యకావ్యంగా వ్రాశారు. ముకుందయోగి ద్విపదగా చెప్పాడు.

శైవుడైన శ్రీగిరి, శ్రీరంగ మాహాత్మ్యమునే కాక నవనాథ చరిత్ర పద్యకావ్యాన్ని, శ్రీగిరి శతకాన్ని రచించాడు.[13] ఇతడు నవనాథ చరిత్రను ద్విపదగా వ్రాసిన గౌరనకు పూర్వుడు. గౌరనతన ద్విపద కావ్యంలో ఈతని పద్య కావ్యాన్ని పేర్కొన్నాడు. శ్రీగిరికాలం క్రీ. శ. 13వ శతాబ్దం.

రెండవకవి భైరవుడు. ఇతడుకూడా శైవుడే. ఇతడు శ్రీరంగ మాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిగజాంకుశము అనే గ్రంథాలను రచించాడు. ఇతని రచనలన్నీ ముద్రితమైనవి. ఈకవి 14వ శతాబ్దం వాడు.

శ్రీరంగ మాహాత్మ్యమునందలి కవితారచనను గురించి శ్రీరామకృష్ణకవిగారు తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తంచేశారు.

"భైరవుండును విప్రకవియు శ్రీరంగ మాహాత్మ్యమును రచియించెను. దుష్టకవి ఘోరపిశాచముల నదల్చు గురుభైరవుండగు భైరవుని కవితా ప్రవాహమున కిక్కవి వాక్పుష్పదామములు నిలువజాలకున్నను, వర్షాంతపు నదివోలె నదినీరసమగుచుండ నిత్యపరిమళశోభితంబగు వరదరాజ కృతి సరసమై పండిత భృంగముల కాకర్షణ యంత్రమువలె నున్నది. "[14]

7. నిర్వాహక కార్యదర్శి

8. సంపాదక కార్యదర్శి - శ్రీమతి. ప్రతిభారాణి

9. సంచాలక కార్యదర్శి - శ్రీమతి. అవధానుల సుమతి.

10. ప్రచారక కార్యదర్శి - శ్రీ దొంతుల లింగ మూర్తి.

ఇది నేటి గంగా తరంగిణీ సారస్వత సమితి మంథని వారి నూతన సభ్యుల వివరణ. వీరు ఈ సంస్థకు సాయ శక్తులా సేవలనందిస్తూ ఉంటారు.

రేగళ్ళ మురళీధర శర్మ,
అధ్యక్షులు,
గంగాతరంగిణీ సారస్వత సమితి,
మంథని - 505 184.



గ్రంథకర్త
కవిశేఖర, గంగా రాజేశ్వరరావు



తాతసేవలో మనుమరాలు
చి॥ కుమారి స్రవంతి

చిన్న కుమారుడు
చి॥ మనోహరరావు
కుమారిత

"ఇనకులంబున వేంక-టేశుండు మున్ను
జనియించి తనపుణ్య - చారిత్రమెల్ల
బోయకులంబునఁ - బుట్టు వాల్మీకి
సేయ నందుఁ బ్రమోద - చిత్తుండుగాక
అర్కవంశమున నీ-వై జనియించి
తార్కాణగాఁగ నే-తత్కథా విధము
రచియింపు మనియె - శ్రీ రామచంద్రునకు
నచలిత ప్రీతిగ-దా నిజాన్వయుఁడు
తన చరిత్రంబు కీ-ర్తనసేయ వినుట
తనయులచేఁగాదె - తామున్ను వినియె"

- శ్రీ రామాయణము, అవతారిక, పుట - 7, పంక్తులు. 151 -160.

### 1.3.3.5 వరదరాజు రామాయణము - రంగనాథ రామాయణము.

వరదరాజుకు ముందుగల ద్విపద రామాయణాలలో రంగనాథ రామాయణం ప్రఖ్యాతమైంది. తర్వాత తాళ్ళపాక అన్నమయ్యగారి ద్విపద రామాయణం పేర్కొనదగి ఉంది. కాని ఇది నేడలభ్యం. వరదరాజు తన శ్రీ రామాయణంలో రంగనాథ రామాయణ కర్తను గురించి ప్రస్తావించలేదు. కవిస్తుతిలో 'నన్నయభట్టారకాది కవులను మాత్రమే ప్రశంసించియున్నాడు. రంగనాథ రామాయణ ప్రశంస ఈ రామాయణంలో లేకున్నా ఆ రామాయణంలోని గుణదోషాల్ని వరదరాజు గుర్తించి ఉండవచ్చు. రంగనాథ రామాయణంలోని అనేక అమూలక విషయాల్ని గుర్తించి కాబోలు వరదరాజు తన శ్రీ రామాయణాన్ని మూల విధేయంగా వ్రాశాడు. తనకు ఇష్టదైవమైన శ్రీ వెంకటేశ్వరుడు ప్రత్యక్షమై

"ద్విపద గావింపుము - తేట తెల్లమిగ
నిపుణత శ్రీరాము-ని కథాక్రమంబు
నాలాయమిది యథా-వాల్మీకముగను
చాలసోఁకోర్చి ర-స స్థితుల్ మెఱయ
నీవుగా కితరులు - నేరరుపూని
యేవం విధంబుగాఁ - గ్సతి నిర్వహింప"[16]

5. ఇందు యతి ప్రాసలతో పాటు అంత్య ప్రాస నియమము కలదు.
6. రెండు కూటముల తరువాత యతి స్థానము.
7. హగణ, జగణ, యగణములు నిషిద్ధములు(ఏలయన వీని వలన నడక కుంటు బడును).

వీనికి ఉదాహరణములు ఆంజనేయ విభక్త్యష్టములో చూడనగును. ఈగ్రంథములో ప్రాస యతి వాడబడినది.

## ప్రత్యేక రగడలు

ఈకావ్యము లో అపవాదములుగా కొన్ని రగడలు దొర్లినవి. వానికి నామ కరణ లక్షణములు సూచితము.

1. ప్రవాళ రగడ- 6మాత్రలు - రూపకతాళం ఇందు రెండు, మూడు, నాలుగు మాత్రా గణములు వచ్చును.(2+4+=6, 3+3=6, 2+2+2=6)
2. మహాప్రవాళరగడ- ప్రవాళరగడకి ద్విగుణము.
3. మరాళగతిరగడ- 8 మాత్రలు - ఆదితాళము (4+4=8, 5+3=8, 3+3+2=8).
4. మహామరాళగతిరగడ - మరాళగతికి ద్విగుణము
5. రగడమాల శపిక ప్రాస యుక్త బహురగడల సమూహము.

మద్విరచిత పార్వతీ చరిత పరీక్షిచ్చరిత కావ్యాలలో రగడలు, గర్భాలు మరియు బంధాలను చూడ నగును.

4. అని పల్కి భరతుఁడ త్యాపన్నుఁ
డగుచు ............ పల్కెనపుడు 613 - 8996

5. అనురక్తులై............ కూర్మిఁజేరఁగ 617 - 9085
నీవెకొలువు లోపలికి 9116

6. ఆవీరశేఖరుండ డలుచుఁ బలికె 626 - 9308
...........మనలను నెడవాసి మరణంబు నొందె - 9346

7. అరయదైవాధీనుఁడ స్వతంత్రుండు 638 - 9609
............చూడఁడేమియును 9640

8. అలరాహు ముఖమున హరిణాంకు 669 - 10343
............సూర్యప్రభవోలె 10374

వరదరాజు శ్రీ రామాయణ మందలి బాలకాండలో 5846, అయోధ్యా కాండలో 10738 ద్విపద పంక్తులు కలవు. మొత్తంమీద వరదరాజు రచించిన శ్రీ రామాయణం రంగనాథ రామాయణం కంటె మూలానుసారిగా విపుల రీతిలో వెలసిన ద్విపదకృతిగా భావించ వచ్చును.

సంఖ్యా సూచిక

1. శ్రీ రామాయణము, కట్టా వరదరాజకవి, బాల అయోధ్యాకాండములు, మద్రాస్ గవర్నమెంట్ ఓరియంటల్ సిరీస్ నం. ఎల్. పుట 8, పంక్తులు 173 - 178.
2. అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము 6, పీఠికపుటలు ii - iii.
3. శ్రీ రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 9, పంక్తులు 199 - 213.
4. Vide : Sources of Vijayanagara History, P.P. 244 - 245.
5. Vide : Sources of Vijayanagara History, P.P. 262.
6. శ్రీరంగ మాహాత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య. ఆర్. 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ, పుట 4.

7. Vide : Madras Government oriental mannuscripts library Bulletin, Vol. I No.I. Edited by Nidudavolu Venkatarao., P.P.91.

8. చూ. 17వ శతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయ విశేషాలు (వ్యాసము) నేలటూరి వెంకట రమణయ్య, భారతి, పార్థివ మాఘము, సంచిక 2, సంపుటము 23, పుట112.

9. శ్రీరంగ మాహాత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య, ఆర్. 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాసంస్థ, పుట. 5.

10. శ్రీ రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట. 5, పంక్తులు 103 - 110.

11. చూ. పరమ భాగవత చరిత్రము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య 7294, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ, పుటలు 21-22.

12. శ్రీరంగ మాహత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య, ఆర్. 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ , పుట 374.

13. చూ. ప్రాచీనాంధ్ర కవులు (వ్యాసము), నిడదవోలు వేంకటరావు, భారతి, ధాత జ్యేష్ఠము, సంచిక 6, సంపుటము 13, పుటలు 701.

14. మానవల్లి రచనలు - వ్యాసములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు - 4, 1972, పుటలు. 296 - 297.

15. శ్రీ రామాయణము (ద్విపద), పీఠిక పుట xx

16. శ్రీరామాయణము, (అవతారిక) పుట 6, పంక్తులు 123 - 130.

17. చూ. శ్రీ రంగనాథ రామాయణము, పరి. వేటూరి ప్రభాకర శాస్త్రి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురణము.

# ఉపక్రమము

## మరాళగతిరగడ

రామకృష్ణరాయని శ్రీముఖమున -
రాముని శ్రీముఖమును నే గాంచితి!
రామాయణ మణిమాలను సీతా -
రామార్పణముగ గూర్పగనెంచితి!!

గంగారాజేశ్వరవిరచిత శ్రీ-
గంగారామాయణసుమహారము !
శృంగారించెద రాముని గళమున-
భృంగరాజి పాడగ ఝుంకారము!!

## హరిగతిరగడ

సాంగోపాంగము చదివిన బాడిన -
శ్రవణము సేసిన సత్యవ్రతులకు।
భంగపడును భవభయము సుజనులకు -
పరమ సుఖంబులు వరలు సుమతులకు!!

## మరాళగతిరగడ

నిండెను దొమ్మిది పదులు వర్షములు -
పండెను జీవితఫలమును, గ్రుంకఁగ!
ఉండెను నాయు వనెడు రవి పడమర, -
నిండుకొనును బ్రాణతైల; మింకన్!!

కాయ మెపుడు పడిపోవునొ తెలియదు
ఆయిత పడవలమును బిలుపునకై!
ఆయువు సరిపడునో లేదో రా -
మాయణరచనాపూర్ణము కొఱకై !!

సుందరకాండము వ్రాసిన వారికి-
నందునురామాయణరచనాఫల!
మందుకు దానిని మున్ముందుగనే-
నందింతును బుధవరులు మెచ్చ నిల!!

సుందరము శివము రాముని తత్వము-
సుందరత నిధికి సీతయ భాండము!
సుందరచారిత్రుడు హనుమానుడు-
సుందరత్రయము సుందరకాండము!!

మెల్ల మెల్లగా కంటి చూపుసన
గిల్లుచునున్నది, యిక కర్ణంబులు!
చల్లగాలు పనిచేయుము మే మని
సమ్మెకు దిగినవి బలహీంబును!!

ఎల్లకాల మీ దేహంబును మే
మే మోయగా వలెనా? యనికాళ్లను!
చెల్లిపోయె మా బలమిక యే పని
చేయ జాల మని చేతులు వల్కెను!!

ఆశ మాత్రమే మిగిలనది శక్తు-
లన్ని యుండిగినను రామాయణమును!
శేష రహింతముగ చేయుడకు మఱల
జెంద వలెన? జన్మం బనిపించును!!

ఈశు డన్ని చూచును, సల్పువము నీ-
యీప్సితమును రాములకు నర్పణము!
ఆశయ దుఃఖములకు మూలంబు ని-
రాశయ సుఖశాంతులకు దోరణము.

"గుణశాలియౌ కౌశి-కుఁడు 'కోసలేంద్ర!
కన్యకాగర్భము - క్రాఫల ! రాగ
తన్మయతను ప్రభా-తంబయ్యెనిపుడు
తావితోసురలు బృం-దార కాస్యముల
తో వికసిల్లె ని-ద్దురమేలు కొనుము !
శ్రీరామ ! మునికోటి - చింత తోఁదమము
దూరమై తొలఁగె ని-ద్దురమేలు కొనుము !
బలురక్కసుల ప్రతా-పంబులతోడఁ
దొలఁగె తారకలు ని-ద్దురమేలు కొనుము !
మొగిసెను రక్కస-ముదితల కన్నుఁ
దొగలతోఁ దొగలు ని-ద్దురమేలు కొనుము !
దశరథ రాజసు-ధాపయోరాశి
శశధర ! నిద్దుర - చాలింపవయ్య !
భరతాది సోదర-భావ మిళింద
సరసీజ ! నిద్దుర - చాలింప వయ్య !
మాయానిశాచర - మదవన్మరాళ
తోయద ! రామ ! ని-ద్దుర లేవవయ్య !
పర్జన్యముఖ దేవ-పాలన శౌర్య
దుర్జయ !రామ ! - నిద్దుర లేవవయ్య !
మలసియ గస్త్యాశ్ర-మంబు ఖేదములు
తొలగింపవలయు ని-ద్దుర లేవవయ్య !
సరణిలోనర్ధయో-జన మాత్రఁజిన్న
దురమున్న దొకటి ని-ద్దుర లేవవయ్య !
చెనకి నాజన్నంబు - చెఱుచుదాన వులఁ
దునిమింపవలయు ని-ద్దుర లేవవయ్య ! "[3]

'పూర్వా సంధ్యా ప్రవర్తతే' అని మూలంలో వున్నభావాన్ని వరదరాజు పెంచి, ఐదు ద్విపదల్లో వ్రాశాడు. 'వేకువ వచ్చింది' అని అనడానికి కొన్ని ఆధారాల్ని చెప్పితే బాగుంటుందని వరదరాజు భావించాడు.

మునుల తపస్సు వల్ల చీకటి తొలగింది. రాక్షసుల ప్రతాపమనే నక్షత్రాలు తొలగిపోయాయి. ఇలాంటి నిదర్శనాలతో విశ్వామిత్రుడు రాముణ్ణి మేల్కొలిపినట్లు

ప్రవాళ రగడ

కలియుగవైకుంఠము దిరు -
మలఁ దిరుపతిఁ బద్మావతి !
నలువేల్మంగను గాదని, -
యార్తత్రాణా! శ్రీపతి! ॥

వెలసితి శ్రీ వేంకటేశ! -
వేయి నమస్కృతులు నీకు!
గొలుతుము నిను శ్రీనివాస!
గోర్కెలెల్ల నిమ్ము మాకు!!

హరి గతిరగడ

కరుణాకర! శంకర! భక్తవశం-
కర! యభయంకర! దుష్టభయంకర!
పరశు డమరుధర! గంగాధర! విష-
ధరధర! భవ! భవహర! హర! శశిధర!!

గిరిజకుఁ జెప్పిన రామకథను నా-
కెఱిగింపు గిరీశ్వర! గిరిజేశ్వర!
పురహర! వేములపుర రాజేశ్వర!
పరిరక్షిత గంగారాజేశ్వర!

## కృతిపతిస్తుతి

మరాళగతిరగడ

శ్రీరామా నినుఁ దలచు జనులు సం-
సారశరధి నవలీలఁ దరింతురు!
ఓ! రామా నీ నామజపిస్తులు-
ఘోరభవబంధనములను ద్రెంతురు!!

కారుణ్యాంబుధి నీ శరణార్థులఁ-
గల్యాణపరంపరలు వరించును!
క్రూరులు నిను గాదను గర్విష్ఠులు-
కుమతుల సిరి దుర్విధియ హరించును

మత్తకోకిలగర్భవృషభగతిరగడ

రామ రాఘవరామ కోసల-
రాజనందిననందనా! ప్రియ-
కామితార్థఫలప్రదాయక-
కంబుకంఠ నమోస్తు తే z భయ!
సామజార్తివినాశకా క్షితి-
జామనోంబుజ భాస్కరా నయ-
శ్యామసుందర భక్తచందన-
సారసాక్ష జయోస్తు తే z వ్యయ !!

మత్త కోకిల

రామ రాఘవరామ కోసల-
రాజనందిననందనా!
కామితార్థఫలప్రదాయక-
కంబుకంఠ నమోస్తుతే !
సామజార్తివినాశకా క్షితి-
జామనోంబుజభాస్కరా !
శ్యామసుందర భక్తచందన-
సారసాక్ష జయోస్తు తే !

నెవ్వేళ గోరిన - నేనిత్తునీకు
మరుని బారికిలోఁగి - మానంబు వదలి
శరణుచొచ్చితి నీదు - చరణంబులకును
బంటనయ్యెద నన్నుఁ-బని గొమ్మువాలుఁ
గంటి ! వేఁడిన యూడి-గములు చేసెదను"[7]

తాను మన్మథునిచే మోహము నొందింపబడి పరవశుడైనట్లు విశ్వామిత్రుడు మేనకకు తెలిపి, తనతో క్రీడింపుమని కోరినట్లు మూలంలో వుంది. వరదరాజు ఈ భావాన్ని పెంచి విశ్వామిత్రుడు మేనకకు దాసోహమనినట్లు రచించాడు. తాను ఆశ్రమాల్లో ఒంటరిగావుండి అలసిపోయానని మేనక తనను లాలించాలని, తనతీరని కోరికను తీర్చాలనీ విశ్వామిత్రుడు మేనకతో అంటాడు. మేనక తనకౌగిట్లో అతన్ని బంధించాలని ఆయన శరీరతాపం తీరేవిధంగా ఆమెతన్ను రసవార్థిలో తేలించాలని విశ్వామిత్రుడు మేనకను కోరినట్లు వరదరాజు వ్రాశాడు.

మేనక తన ఆశ్రమంలో తనదానిగా వుంటే ఆమె ఏమికోరినా తీరుస్తానని విశ్వామిత్రుడు అన్నట్లు కవి వ్రాశాడు. మన్మథునికి లొంగి, మానం వదిలి విశ్వామిత్రుడు ఆమె పాదాలకు శరణుచొచ్చినట్లు తెలిపాడు. తనను అనుగ్రహిస్తే ఆమెకు బంటుగావుండి వూడిగాలు చేస్తానని విశ్వామిత్రుడు అన్నట్లు వరదరాజు రచించాడు. విశ్వామిత్రునంతటి వాడే వేశ్యకులొంగి ఇలాపతనం అయిపోతే ఇక సామాన్య వ్యక్తి విషయం చెప్పనవసరం లేదు. కామవాంఛ బలీయమైందని దానికి లొంగినవాడు ఇంగితజ్ఞానాన్ని కోల్పోతాడని వరదరాజు నిరూపించాడు. కామవాంఛకు లొంగిపోయి తనవ్యక్తిత్వాన్ని పూర్తిగా కోల్పోయిన ఒక సాధారణ వ్యక్తిగా విశ్వామిత్రుణ్ణి వరదరాజు చిత్రించాడు.

ఇలాగే బాలకాండలో ఇంకను కొన్నిచోట్ల వరదరాజు కావించిన మూల విస్తరణలను చూడవచ్చు.

అంబరీషుని యాగానికి పశువుగా శునశ్శేఫునికి బదులుగా తనకొడుకుల్ని వెళ్ళమని విశ్వామిత్రుడు కోరగా, వారు ఆయన కోరికను తిరస్కరించినట్లు మూలంలోని ఒక శ్లోకంలో వుంది.

కథమాత్మసుతాన్ హిత్వా త్రాయసేన్యసుతం విభో
అకార్యమివ పశ్యామశ్శ్వమాంస ఇవ భోజనే. "[8]

పై శ్లోకభావాన్ని పెంచి వరదరాజు ఇరువదిరెండు పంక్తులలో రచించాడు.

"గౌరవించుటయు శృం-గారించి భక్తిఁ
దేఱిమాచుటయొ చే-తికి పండు ఫలము
నిచ్చుటో పెండ్లి -సేయించుటో చదువు
వచ్చెనా యనివిని -వారి మెచ్చుటయొ
క్రతువులు సేయించి - కలిగిన సొమ్ము
హితబుద్ధితోఁబంచి-యిడుటయో యాత్మ
బోధంబు పిలిచి తె-ల్పుటయొ సద్వృత్తి
బోధించుటో నీవు - పుత్రులంజూచి
పట్టుచుఁబట్టి యీ-పాపంబుమాట
యెట్టాడితిరి చావ-నేఁటికి తమకు
నొనరునె యిట్టాడ - నొక్కని చావు
తనమీఁదఁదెచ్చు కోఁ-దలఁచునె యొకఁడు ?
ఒప్పుగాదిది తన-యుల ప్రాణములకుఁ
దప్పి చావుండను - తండ్రి గలాఁడె ?
ఆడక నీకేమి ? - యీమాట వినఁగ
గూడదుగాక మా-కును వెఱ్ఱితండ్రి!
మహిభోజనము లశ్వ-మాసంబు నటుల
విహితంబుగా దిట్టి - విధమునఁ బల్క
యీ ముని బాలకుం-డెటు వోయనేమి ?
యీ మహీవరు యాగ-మేమైననేమి ?
మీమాట మాతల - మీఁదట నున్న
దీ మొల్ల మనిన మా-నీంద్రుఁడిట్లనియె"[9]




'ఇతరులకు సహాయం చేయదల్చుకుంటె పండ్లు, ఫలాలు ఇవ్వవచ్చు. పెండ్లి చేయించవచ్చు. క్రతువులు చేయించవచ్చు. తనసొమ్మును పంచిపెట్టవచ్చు. మంచిని బోధించవచ్చు. కాని, తనకొడుకుల ప్రాణాల్నే త్యాగంచేయాలని భావించడం వెఱ్ఱితన'మని విశ్వామిత్రునితో ఆయన కొడుకులు అన్నట్లు వరదరాజు తెలిపాడు.

'ఒక్కని చావు తనమీదికి తెచ్చుకోవాలని ఎవ్వరూ భావించరని, ఆ మునిబాలుని సంగతి, రాజుయాగం సంగతి తమ కనవసర'మని వారు విశ్వామిత్రునితో అన్నట్లు వరదరాజు పెంపుచేశాడు.

వనజనాభుదాసు వలన-
దనుజవన వినాశు వలన!
ననిలజుఁడు గుణాఢ్యు వలన-
నఘము వాయు ననఘు వలన!!

## విజయ భద్రరగడ

భీమ విక్రమునకు వి - భీషణాకృతునకుఁ-
బ్రేమవార్ధికి విజిత - విషయ వాసనున కుఁ!
గామి తార్థము లిచ్చు - కల్పభూరుహము కుఁ-
గ్రామస్థితునకు సం - గ్రామ జితరిపునకుఁ!!

## హరిగతిరగడ

అతులిత గుణ సంపన్నుని యందున -
నఖిల సురగణారాధ్యుని యందున!
పతితోద్ధారుఁడు పావని యందున-
ప్రవిమల భక్తి గలుగు హరి యందున!!

## వృషభగ తిరగడ

శమదమాదిసుగుణగరిష్ఠా-
సాధునుత పింగళసునేత్రా-
స్వామి కార్యదురంధర చతుర-
స్వర్ణశైల సురుచిర గాత్రా!
అమిత బల విక్రమ పరాక్రమ-
యమరనుత దుష్కృతలవిత్రా-
యాంజనేయ సుజన శరణ్య స-
హస్రనతు లివె శుభచరిత్రా!!

హాయ ప్రచార రగడ
అంజనీ సుతా - ష్టకంబు!
రంజకము సు - రద్రుమంబు!!

భంజితభవ భయ మమృతము!
సంజనితప్రశాంతియుతము!!

## కృతి సమర్పణ

విజయభద్రరగడ
శ్రీరామచంద్రునకు - సీతాసమేతునకు-
శ్రితజనోద్ధారునకు - శ్రీవత్సవక్షునకు!
శ్రీరమాహస్తసం - సేవితపదాబ్జునకు-
శ్రీమూర్తికిన్ స్వజన - శ్రేయోభిలాషునకు!!

కౌసల్యతనయునకుఁ - గారుణ్యాసింధునకుఁ-
గోసలాధీశునకుఁ - గోదండహస్తునకు!
దాసపోషకునకున్ - దానవవిదారునకు
వాసవార్చితునకున్ - వైకుంఠధామునకు!!

సృష్టిస్థితిప్రళయ - వృత్తిప్రధానునకు-
స్రష్టలకు స్రష్ట కవ - శిష్టునకు శ్రేష్ఠునకు!
అష్టప్రకృతుల కాది - కాద్యంతరహితునకు-
శిష్టరక్షణదుష్ట - శిక్షణసమర్థునకు!!

ధర్మవర్తమునకును - ధర్మస్వరూపునకు -
ధర్మరక్షకునకును - ధర్మప్రచారునకు!
నిర్మలహృదయునకును - నీరేజనేత్రునకుఁ-
గర్మసాక్షికినిఁ ద - త్కార్మవిచ్ఛేదునకు !!

ఏకనారీవ్రతున - కేకనారాచునకు -
నేకవచమునకునున - నేకావతారునకు!!
కాకుత్థ్సతిలకునకు - లోకైకవంద్యునకు -
లోకరక్షకునకు న - లౌకికసమర్థునకు !!
దీనబాంధవునకుఁ - దివ్యప్రభావునకు -
దానవారణ్యఘున - దావాగ్నిశౌర్యునకు!
మానవాకారునకు - మర్యాదరామునకు-
జానకీనాథునకు - జగదేకవీరునకు !!
కృతిసమర్పణ సేసి - కీర్తివంతుడ నైతి -
గృతకృత్యు నైతి స - త్కృతికిఁ బాత్రుడ నైతి!
నతిసుకృతఫలమున గృ - తార్థుడను నే నైతి-
మితి లేని యానంద - మిళితాత్మకుడ నైతి!!

# ప్రథమాశ్వాసము

# సముద్రోల్లంఘనము

## కందగర్భహరిగతిరగడ

శ్రీరామ! య సీమదయావారిధి-
సీతామృదుకరభావితచరణా!
మారుతిహృదయాభరణా! వీరా -
మారారినుత యవిద్యా హరణా!!

## కందము

శ్రీరామ! యసీమ దయా!
వారిధి సీతామృదుకర - భావితచరణా!
మారుతి హృదయాభరణా!
వీరా! మారారినుత య - విద్యాహరణా!!

## వానరవిచారము

### ప్రవాళరగడ

శ్రీరామాజ్ఞలు గొని సీ -
తారమణిని - గాలించిరి !
వారిధి కడఁ బయనము గపి-
వీరవరులు సాలించిరి !!
దారుణభీషణతరంగ -
ఘోరయుదధినిం గాంచిరి!
దారి నడ్డెడు మహోకా-
లోరగ మని మది నెంచిరి!!
ఆకాశపు గంగ నంట-
నలలు మింటి వరకు దూకు!
భీకరఘోషలను ఫెడేల్ -
ఫెడే ల్మనుచు దరిని దాకు!!
ఝషమకరతిమింగిలక -
చ్ఛపములు విచ్చల విడిగా!
వృషభములు మదించి తిరుగు-
విధిఁ జరించు వడివడిగా!!

### మరాళగతిరగడ

వననిధి దాటగ లేము దాటినను -
దనుజుల గెలువగ లేము గెలిచినను!
వనజముఖిని సీతను గని యిద్దరి-
వఱకు జేరగాఁ జాలము మే మను!!

కొనుచుఁ దమదు చెక్కిళ్లను జేతుల-
నునిచి మిక్కిలి విచారగ్రస్తులు!
గనుచు నొకరి మో మొక్కరు దుఃఖా-
క్రాంతు లైరి వానరులు ప్రశస్తులు!!

విజయభద్రరగడ

జ్ఞానవానుండు - హను - మాను డే డని జాంబ
వానుండు సూచి యొక - ద్రుమాను క్రిందను గనియె!
వానరేంద్రునకు రఘు - వంశచంద్రుని పద
ధ్యానమగ్నున కుదా - సీనునకు ని ట్లనియె!!

మరాళగతిరగడ

రుద్రాంశంబున జన్మించితి వా-
రూఢప్రజ్ఞుడ వైతి రఘురామ!
భద్రుని నామసుభద్రకవచమున-
భయము వాసితివి రాక్షసవిరామ!!

బాలప్రాయము నందున భానునిఁ -
బండని కబళించితి బలవంతా!
చాల కుపితు డై వజ్రి గొట్టగా-
సహియించితివి గదా! హనుమంతా!!

విజయభద్రరగడ

బలము నీదే కాదు - బలిని గెలిచిన మహా -
బలశాలిరామవిభు - బలము - నీ కుండ గాఁ !
బలుడ ముల్లోకాల - బలము లేకము లైన
భయము నీకా? మహా - బలుడు నీ కండ గాఁ!!

ఈక్షించి ప్రేమఁ గను - లేక్షుండు రాముఁడే-
యక్షీణబలుడ వీ - వనుచు నిను గడు మెచ్చె!
దక్షుడవు గార్యసా - ధకుడ వీవని నమ్మి -
యక్షయపు టుంగరం - బానవాలుగ నిచ్చె!!

నీక్షణం బందు నీ - వీ శరధి లంఘించి-
వీక్షించి జానకిని - శిక్షించి దనుజులను!
అక్షముల మమ్ములను - నంగదప్రభృతులను -
రక్షించు సుగ్రీవ - రామచంద్రాదులను!!

మధురగతిరగడమాల

అంతయు విని హను - మంతుడు మురిసెను!
స్వాంతంబున నిజ - బలమును నరసెను!!
చింతితకార్యము - సేసెద ననుచును!
బంతమువట్టె ప్ర - భావితు డగుచును!!

ఇంతిం తాయెను - నంతం తాయెను!
నెంతో దూరం - బెదుగుచు బోయెను!!
అంతయు దానే - యగుచును బోయెను!
వింతగ మదినిఁ ద్రి - విక్రము డాయెను!!

మరాళగతిరగడ

కైలాసేశ్వరు వాహనంబు నగు-
ఘనవృషభము వలె వానరర్షభుఁడు!
శైలాకారుఁడు ఱంకె వేయగాఁ-
త్రైలోక్య మదిరె భయపడెను జముడు!!

హరిగతిరగడ

అబ్బబ్బో ప్రళయ మె యని గ్రహములు-
తబ్బిబ్బయి తమ దారులు దప్పెను!
బొబ్బలు విని రవి భూరిభయమువడ-
మబ్బు లతనిఁ దమ మఱుగున గప్పెను!!

### విజయభద్రరగడ

ఉల్లసితవక్త్రుండు - నూర్ధ్వరేతస్కుండు-
నుత్సాహము మొగాన - నుట్టిపడగను లేచెఁ!
బల్లవితహృదయులను - భయవిరహితుల హితుల
బ్లవగేంద్రులఁ బ్రసన్న - భరితదృష్టినిఁ జూచె!!

ఖగములును, మృగము లా - కసమందు, భూమిపై-
గలకలధ్వానములు, - ఘనరవము లొనరించె!
జగదేకవీరునకు - సల్పెను బ్రదక్షిణము-
జయ మనుచుఁ గపికి శుభ - శకునము ల్భాసించె!!

వరబుుషులు జయము నిను - వరియించు ననుచుఁ బా-
వనికై యనేకదీ - వన లిచ్చి మురియగా!
సురవరు లనుగ్రహపుఁ - జూపులకు జతచేసి-
శుభము నీ కగు నని ప్ర - సూనములు గురియగా!!

## ప్రయాణ సన్నాహము

### మరాళగతిరగడ

గంతును వేసి మహేంద్రనగము పైఁ -
గంపించెను భూకంప మనగ నది!
జంతుపక్షిసంతతు లదరె సురల-
జంటలు మౌనులు జడిసిరి తమ మది!!

ఉత్తరదిక్కున భాస్కరుండు నే-
డుదయించెను విపరీత మి దనుచును!
బిత్తరిలుచు ద్విజు లర్ఘ్యజలము ల -
ర్పింపక నిలిచిరి తూరుపు గనుచును!!

ప్రాక్సతియంభోనిధి యను - బాన్పున-
భానుం డను బాలునిఁ బ్రసవించెను!
దిక్సమాప్తముల కీ శుభవార్తను-
దేజోవార్తాహరు డెఱిగించెను!!

జయరామా! యని హనుమంతుడు భీ-
షణముగ గర్జించె దిశలు మ్రోయగ!
భయమున రాక్షసగర్భంబులు భూ-
పతనము లయ్యెను భామిను లేడ్వగ!!

గురునకు రవి కభివాద మొనర్చెను-
గోసలపతికై నతు లర్పించెను!
సురలకు మునులకు వందనముల నిడి-
సూటిగ నొక పెట్టున గుప్పించెను!!

ప్రవాళరగడ

శతయోజనవిస్తీర్ణము - శరనిధిమకరాలయంబు!
మతి రాముని గొని యొనర్చె - మారుతి యుల్లంఘనంబు!!
రామధనుర్ముక్తము నా - రాచము విధముగ నేగెద!
రామసతిని సీతను నీ - రాతిరి జని నేఁ జూచెద!!

ప్రాణము వోయెడు దరి నొక - పర్యాయము రాము నెవడు!
ధ్యానించునో భవజలనిధి - దప్పక తరియించు నతడు!!
ఆరాముని చింతనం బ - హర్నిశలును మదిని గలదు!
పారావారం బిది గో - ష్పదము నాకు భయము వలదు!!

అని పలుకుచుఁ దత్‌క్షణ మే - హనుమ దేహమును బెంచెను!
మును ముందుకు బాహుయుగం - బును మిగులఁ బ్రసారించెన
ఘనవాలము మింట నెగురఁ - గాకోదర మనిపించెను!
గనుచు నూర్ధ్వదిశను దనదు - కంఠము రుజువుగ నుంచెను!!

ఫలియించెనాడు త-పంబు లన్నియును
సులభంబుగా మిమ్ముఁ - జూడంగఁ గల్గె
యేను సేసిన భాగ్య-మెవ్వరుఁ జేయ
రానందమగ్నుం-డనైతి నివ్వేళ
రాజర్షి వయ్యును - బ్రహ్మర్షివైతి
వే జతీంద్రులకైన - నీశక్తి గలదె ?
నీవువచ్చుటఁ జేసి - నేఁడు నాభూమి
పావనంబయ్యె నా-భాగ్య వైఖరిని
నాకేశవందిత ! - నాకిట్టిమేలు
చేకూరఁదలఁచి వి-చ్చేసితిరిటకు
నేమి వేఁడిననిత్తు - నెటు సేయుమనినఁ
దాను సింపకొనర్తు - దప్పదీమాట
అవుగాము లెన్నక-యను మానముడుగి
ప్రవిమలాత్మక నన్నుఁ-బని గొను మిపుడు. "23

వరదరాజు ఇక్కడ మూలాన్ని కొద్దిగా విస్తరించినా మొత్తం మీద ఈ భాగాన్ని మూలానుసరణగానే భావింపవచ్చు. వరదరాజు మూలంలోని భావానికి ఎలాంటి హాని జరుగనీయకుండా క్రొత్తమెరుగులు దిద్దాడు. దశరథ మహారాజు విశ్వామిత్రునికి స్వాగతం చెప్పి ఆయన్ని పొగడిన విషయానికి వరదరాజు అక్కడక్కడ ఒకటిరెండు పంక్తుల్ని పెంచాడు.

విశ్వామిత్రుణ్ణి ఉద్దేశించి దశరథుడు 'నాభాగ్య వశాన నీవు ఇచ్చటికి వచ్చావు. నా పుట్టుక సఫలమైంది. నా బ్రతుకు మంచి బ్రతుకైంది'. అని అన్నట్లు మూలంలో వుంది. వరదరాజు ఇక్కడ రెండు పంక్తుల్ని అదనంగా చెర్చాడు. 'ఇంత సంతోషాన్ని ఎట్లా భరించగలనని, తనతపస్సులన్నీ ఫలించాయని' దశరథుడు అన్నట్లు వరదరాజకవి రచించాడు.

'మీరు అయోధ్యకు రావడంవల్ల నేను పుణ్యక్షేత్రాల్లో వుండే వాడినైతి' నని దశరథుడు విశ్వామిత్రునితో అన్నట్లు మూలంలో వుంది. వరదరాజు 'తమరాకవల్ల మాభూమి పావనమయ్యిందని, మాకు ఇలాంటి మేలు చేయడానికే మీరు వచ్చార'ని దశరథుడు విశ్వామిత్రునితో అన్నట్లు వ్రాశాడు.

నిర్వికారాత్ముండు - నింగిలోఁ బయనించెఁ!
బర్వమున నుప్పొంగు వారినిధి యనిపించె!!

## సురసానిరోధము

ప్రవాళరగడ

ఆ వజ్రాంగుని బావని-
నమరులు గని యిట్టి బలుడు!
నీ వేళను లంకఁ బ్రవే-
శింపఁ గలడ? యచంచలుడు!!

అనుచు వితర్కించుచు సుర-
సాఖ్యానాగమాతఁ బిలిచి!
పనిచిరి కపివరుని బుద్ధి-
బలము బరీక్షింపఁ దలచి!!

సురల యానతినిఁ గొని యా-
సురసతి భువి దిగి వచ్చెను!
అరసెను మదిలోన, నుపా-
యం బొక్కటి స్మృతిఁ జొచ్చెను!!

హనుమంతుఁడు బలవంతుం-
డైన, బుద్ధి గన నెంచెను!
ఘన మగు దన యాలోచన-
గార్యరూపమున నుంచెను!!

భీకరకాయంబు దాల్చి-
భీషణరవమున నార్చెను!
ఆకాశము నావరించ-
నట్టహాసము నొనర్చెను!!

ఆహో!హో! కడుపు నిండ -
నాహారము లభియించెను!
ఓహో!హో! సుదిన మి దని-
యుత్సాహము ప్రకటించెను!!

ఆకలి యగుచున్నది నా-
యాననంబుఁ జొరువు మనుచు!
నాకవాసిని దెలిచె వద
నంబు యోజన మది గనుచు!!

కేసరిసుతు డనెను నేను-
గీర్తిమంతు డగు రఘుపతి!
దాసకోటిలో నొకడను-
దారి విడువు మమ్మ సుమతి!!

రామకార్యమును గూరిచి-
లంకకు నేఁ బోదు నిపుడు!
రామసతిని సీతను గని
రాముల కెరిగించి యపుడు!!

తిరిగి వచ్చి నీ కోరిక -
దీర్తు నమ్మ నన్ను నమ్ము!
వరము గోరుచుంటిని శ్రీ
వరదుని పై యాన సుమ్ము!!

బొంకి బోర్లవేయు వారిఁ-
బోలెడు మందినిఁ జూచితి!
నింకఁ జెల్ల విట్టి కల్ల-
లింత వరకు నే వేచితి!!

అనుచు మ్రింగఁ బోవు నంత
నైదానుడ లెదిగెను హరి!
గనుచు సురస ద్విగుణము వ-
క్త్రంబు సాచి రమ్మను తఱి!!

వాయుసుతుఁడు పెంచెను ము-
ప్పది యోజనములు దేహము!
పాయక తెఱచె సురస యే-
బది యామడ లా యాస్యము!!

ఆగక మతిమంతుం డ-
త్యంతసూక్ష్మరూపు డగుచు!
వేగఁ జొచ్చి యాపె నోట
వెడలి వచ్చి యనెను నగుచు!!

అమ్మ! నీ వరం బిచ్చితి
నానతిమ్మ పోయి వత్తు!
సమ్మతిఁ సీతమ్మ జాడ
సరగునఁ దప్పక య తెత్తు!!

హరివరు డిట్లన నాయమ
యమరవంద్య! నీ కభయము!
వరియించెడు నిన్ను వీర్య-
వంతా హనుమంత జయము!!

అని దీవన లిచ్చి నాగు-
లమ్మ దివినిఁ గూర్చి యేగె!
విని ముదమునఁ గపివరుండు
వినువీధిని ముందు సాగె!!

## మైనాకాతిథ్యము

### తురగవల్గనగతిరగడ

ప్రజ్వరిలుచు నెత్తి పైన
భాస్కరుండు వెలుగ హనుమ!
యుజ్జ్వలప్రతాపుఁడు సను-
చుండె నపరభానుఁడు సుమ!!

మేరుధీరుదేహచ్ఛాయ
మిగుల బొల్చు జలము లందు!
భూరినావ వేగఁ దరలి
పోవు ననగ జలధి యందు!!

మందమారుతములు వీవ
మబ్బులు గొడుగులను బట్ట!
మందరాద్రితుల్యు డరిగె-
మౌనివరులు జేలువెట్ట!!

మండు టెండలకు నడలఁడు
దండి వేడిమికి జడియఁడు!
మెండు చెమటలకుఁ దడియఁడు
నిండు మోదమును విడువఁడు!!

గరుడుఁ డమృతమునకు దివికిఁ-
గదలు చుండె నో యనంగ!
సరసర నా లంకకు వన-
చరుడు పయన మై చనంగ!!

### ద్విరదగతిరగడ

శరధిరా జది గాంచి - శైలరాడ్సుతుఁ బిలిచి!
కరవలి కొమరు భావి - కార్యంబు మదిఁ దలచి!!

రఘురాము బంటు హరి - రామదాసుఁడు వచ్చె!
నఘహరుని హరుని కళ - లన్ని వెంటను దెచ్చె!!

అఘటనఘటనకృతు స - మర్చనల సేవింపు!
మఘవాను భయము మఱు - మాయంబు గావింపు!!

విజయభద్రరగడ

సగరాన్వయుల చేత - సంవర్ధితుడ నగుట
సాగరుం డని వచ్చె - సార్థకం బగు పేరు!
నగరాజపుత్ర యా - నాడు మొదలుగ నే ఋ-
ణగ్రస్థు నైతి నీ - నాటి కయ్యది దీరు!!

సగరకులజుడు రామ - చంద్రు డాతని జాయ
జానకీసతి యాపె - జాడలకు హరి వెడలె!
నగధీరు కీశవరు - నకును నాతిథ్యంబు-
నయ మొప్ప నిడుము కపి - నాథుండు గడు బడలెఁ!!

నని యిట్లు మైనాకు - డాజ్ఞాపితుం డగుచు
నా క్షణంబున లేచి - యబ్ధి పైనను నిల్చెఁ!
గనకమయరుచిరశృం - గములచే వెలుగుచును
ఘనత్రికూటాద్రి యన - గాఁ దేజమునఁ బొల్చె!!

హనుమంతు మార్గంబు - నడ్డగించుచు రెండు
హస్తములు జోడించి - యత్యంత నమ్రుడై!
వనచరేంద్రా మీకు - వననిధేంద్రుని ఘన-
స్వాగతం బనుచు నా - హ్వానించెఁ బ్రీతుఁడై!!

పక్షములు ఖండింప - వజ్రాయుధుఁడు రాగ
రక్షించె వేగ వా - రాశిలోఁ ద్రోసి నను!
దక్షుఁ డనిలుండు మీ - తండ్రి దీనావనుఁడు
దాసుడను మీ యెడ స - దా నే కృతజ్ఞుడను!!

ప్రవాళరగడ

ఫలములు పక్వములు దినుము
జలములు మధురములు ద్రావు!
మలయానిలములు వీవగ
నలసట దీర్చుకొను మీవు!!

చిలుక తేనెపలుకులు గో-
కిల కలరవములును వినుము!
పలురకముల పూలవాస -
నల నాఘ్రాణంబు గొనుము!!

అళుల బృందగానముల, నె-
మళుల జంట నృత్యమ్ముల, !
నలరుచు విను, గను శ్రోత్రా-
క్షుల కాహ్లాదకరమ్ముల!!

హరిగతిరగడ

అని మైనాకుం డాడు పలుకులకు
హర్షపులకితాంగుం డై ధీరుడు!
వినిపించెను దన వివశత నంతయు
వీరుడు నా సామీరి గభీరుడు!!

మరాళగతిరగడ

ముందర గలదు బృహత్తర కార్యము
భోగవిశ్రమముల కిదా సమయము!
తొందరగాఁ బరుగిడు కాలము తో-
డ్తోడఁ బోని యెడ నిడవలయుఁ గ్రయము!!

ప్రేమ తోడ నాహ్వానించితి సం-
ప్రీతుడ నైతిని నే గిరిరాజా!
రామకృపాధారావర్ష మనవ
రతము గురియు నీ పై రవితేజా!!

అనుచును దన మృదుకరకరసరసిజ-
మున స్పృశియించె నతని శీర్షంబును!
ఘన మగు వేగంబునఁ దన పయనము
గావించెఁ బ్రదర్శించె బలంబును!!

కాంచనదేహుడు రువ్వడిగా లం-
కాపురి కై మార్గము సవరించెను!
ఎంచగ గంగానది గైలాసము
కేతెంచుచు న్నది యనిపించెను!!

**సింహికాసంహారము**

బాగుగ వీచెడు నెదురు గాలిలో
వేగము దగ్గిన యోడ విధమ్మున!
సాగెడు బయనం బద్ది యమాంతం-
బాగిపోవు నా యనెడు భయమ్మున!!

వేగ నిరోధక మైన దైన యీా-
విధ మే మని క్షణ మాలోచించెను!
లాగెడు శక్తియు సాగుట గని తన
లాంగూలము నొక పరి ఝూడించెను!!

**మహాప్రవాళరగడ**

పైకిఁ జూచెఁ బ్రక్కలన్ని
పరిశీలించినను దృష్టి-

పథమునఁ బడ నట్టి దైన
ప్రశ్నార్థక మౌ మాయను!
గాకుత్స్థతిలకుని బంటు
గనడు, క్రింద జలధి గనెను
గ్రహము గహ్వరానన యా-
కర్షించుట దన ఛాయను!!

దూకె గుభేల్మని జలమున
దుష్టరాక్షసీముఖ మను
తోరపు సర మందున నీ-
దుచు మీన మనఁ జరించెను!
బ్రాకటముగ ఖరనఖములఁ
బాపాత్మయుదరము చీల్చి
భరియింపగ రాని ప్రబల
బాధకు గురి గావించెను!!

కొట్టుకొనుచు మొత్తుకొనుచు
ఘోరముగను దన్నుకొనుచు
గుట్టవలె ధభేల్మనుచును
గూలెను వార్ధి జలంబుల!
నెట్టకేల కార్భటంబు
లెల్లను జాలించివేసి
యిమ్ముగ నా సింహిక త్యజి-
యించెను దన ప్రాణంబుల!!

# సాయంకాలవర్ణనము-సూర్యాస్తమయము

## హరిణగతిరగడ

తిరిగి హనుమయు సాగె ముందుకుఁ
దీవ్రగతిఁ గొని త్రికూటాద్రికి!
సరసరగ గగనమున రవియును
జనుచు నుండెను బశ్చిమాద్రికి!!

బాటసారులు నలసి సొలసియు-
బసలు సేరుట కొఱకుఁ దఱలిరి!
సూటిగాఁ బను లన్ని నెరవే-
ర్చుకొని పాటక జనులు మఱలిరి!!

కుక్షి నిండగఁ బశువు లన్నియుఁ
గూటములుగాఁ దిరిగె నిండ్లకుఁ!
బక్షిగణములు నేరుకొని తిని
బయలుదేరెను దమదు గూండ్లకు!!

## మధురగతి రగడ

పక్షిమృగగణా - వాస్థానం బగు!
వృక్షఫలకుసుమ - విస్తారం బగు!!

దక్షిణకూలపు - దర్శనమును గొనె!
నక్షీణమతి బలాఢ్యుఁడు హరి, గనె!!

పరిఖావలయితఁ - బ్రాకారావృత!
నరిభీకర పీ - రాసుర రక్షితఁ!!

బురి లంక నసుర - పురము వ్యవస్థిత!
నరు దైన త్రికూ - టాద్రి సుసంస్థిత !!

5) కైక శ్రీరాముని అడవికి పంపినందువల్ల భరతుడు ఆమెను దూషించిన విషయం మూలంలో ఒక శ్లోకంలో వుంది.

"శ్లో|| సాత్వ మగ్నిం ప్రవిశ వా స్వయం వా దణ్డకాన్ విశ్వ |,
రజ్జుం బధాన వా కణ్ఠే నహి తేఽన్యత్పరాయణమ్ ||. "[38]

ఈ శ్లోకభావాన్ని వరదరాజు పదిపంక్తుల్లో విస్తరించి రచించాడు.

"ఎల్లరు రోసిన - యీ బ్రదుకేల ?
చెల్లదు నీకు నీ-క్షితిమేనుఁదాల్ప ?
నడవికి జనుము కా-రగ్గిలోఁ జనుము
జడనిధింబడుము వి-షంబైనఁ గొనుము
నురిబెట్టుకొను మాయు-ధోరు ఘాతమునఁ
దెరలుము నూతిలోఁ - ద్రెళ్లుము నాల్క
వెఱుకు కొమ్మిఁక గొంతు - విసుకుక చావు
మురక కూడును నీరు - మడిగి నశింపు
పడుమర్వినీ మేడ-పై మాడు వెక్కి
గడియలోన నపకీర్తి - గడ తేర్చుకొనుము"[39]

భరతుడు కైకను 'అగ్నిహోత్రంలో నైనాపడు, దండకారణ్యానికైనావెళ్లు, రజ్జువును కంఠానికి కట్టుకుని ఉరిపోసుకునైనా ప్రాణాలు విడువు' అని తూలనాడినట్లు మూలంలోవుంది.

వరదరాజు ఈ భావాన్ని విస్తరించి రచించాడు. 'అందరూ ఈ సడించిన నీ బ్రతుకు ఎందుకు ? నీవు ఈ భూమిపై బ్రతుకదగవు. అడవికి వెళ్ళిపొమ్ము, అగ్గిలోపడుము. జలనిధిలో పడుము. విషం తీసుకొనుము. ఉరిబెట్టుకుని మృతిచెందుము. నూతిలోపడుము. నాలుక పెరుకుకొమ్ము. గొంతు పిసుక్కొని చావుము. మేడమీద నుంచి పడుము.' అని భరతుడు తన తల్లిని తీవ్రంగా దూషించనట్లు కవి తెల్పాడు.

కైకదుష్ట ప్రవర్తనాన్ని లోకుల కళ్ళకు కట్టినట్లు తెల్పాలనే ఉద్దేశ్యంతో వరదరాజు ఇక్కడ మూలాన్ని పెంచాడని భావించవచ్చు. కవి ఇక్కడ, పామరజనులు సాధారణంగా వాడే పదాల్నే వాడాడు. ఈ రీతిగా ప్రధానపాత్రల స్వరూపాల గుణగణాల ప్రస్తావన మూలంలో ఎక్కడవచ్చినా వరదరాజు వాటిని తన అనువాదంలో విస్తరించి రచించాడు. ఈ పాత్రల స్వరూపాల పట్ల, గుణగణాలయెడల పాఠకులకు స్పష్టమైన

ఒప్పులకుప్పలు దమతమ భర్తల
కొప్పుగ గొప్పగ గొప్పులు ముడిచిరి!
మెప్పుకుఁ బతులను గన్నుల నడుగుచు
గుప్పగఁ దావులు బువ్వులు ముడిచిరి!!

భామలు దీపారాధన సేసిరి
హోమము సేయదొడగిరి గృహస్థులు !
హోమ జ్వాలలు దివికిం జేర్చె మ-
హోజ్వలరావణవిభు సత్కీర్తులు!!

## నారదాగమనము - చంద్రోదయము

### మరాళగతిరగడ

నారదర్షి రా స్వాగతములు దా-
నవపతి యిడి, యాసీనుడు గాంగా!
'నూరక రారు మహాత్ములు విశేష
మున్న యెడల సెల వొసగు' డనంగా!!

భో! రావణ బలవిక్రమవైభవ
భోగభాగ్యముల లోన నిను బోల!
రేరేడు జగంబులఁ ద్రిమూర్తులును
నితరులఁ గూరిచి యికఁ జెప్ప నేల?!!

బోరగిలిన గ్రహములఁ ద్రొక్కుటలోఁ
బురుషార్థమ? నీ కియ్యది చెప్పుము!
వారల యురముల నడుగుల నిడుచును-
జేరుమి సింహాసనమును నొప్పుచు!!

నారదుఁ డిట్లని వీణియ మీటుచు
నవ్వుచు హరిఁ బాడుచు వేంచేసెను!

ఆ రాక్షసవిభుఁ డతిగర్వంబున
నా గ్రహముల వెలికలఁ బడఁ ద్రోసెను!!

క్రూరశనైశ్చరదృష్టి వడియె నౌన-
గూడెను నేనాటిది యొ పాతకము!
ప్రారంభము గొనె నేల్నాటి శనియు
మారెను నపుడె సురారిజాతకము!!

ఘోరవినాశము దలపై నాడగ
నా రావణు మతి దాటెను హద్దులు!
దారులు దప్పును విధివశమున గ్రహ-
చారము చాలని విబుధుల బుద్ధులు!!

విజయభద్రరగడ

సుదతిభూసుతమనో - శోకంపు చీకటుల
నదలించి త్రోలుటకు - నరుదెంచె నో యనగ!
సదయుండు శ్రీరామచంద్రుఁడు దయారసము
ముదిత్తపైఁ జల్లుమని - పుత్తెంచె నో యనగ!!

సదమలచరిత సీత - సౌశీల్యచిహ్న మన
ముదముతోఁ బ్రాక్సతీ - ముఖ మందుఁ దిలక మనఁ!
నుదయించు జానకికి - నుత్సాహ మింక నన
నుదయించె శశి సీత - నోదార్ప వచ్చె నన!!

## లంకావధ

హరిణగతి రగడ

ఉర్వి విచలిత పాద ఘట్టను
నూర్ధ్వకేశఁ గరాళవక్త్రను!

### 4.2.2 మూల సంక్షేపాలు

అయోధ్యాకాండలో కవితనకు ఉచితమని తోచిన అనేక చోట్ల మూలాన్ని సంక్షేపించి అనువదించి యున్నాడు.

1) రాముడు అడవికి పోవాలని, భరతుడు రాజ్యాన్ని పొందాలని కైకేయి దశరథుణ్ణి కోరింది. ఆమె కోరికల్ని విన్న దశరథుని మానసిక వ్యథను గురించి మూలంలో -

"శ్లో॥ శ్రుత్వా తు రాజా కైకేయ్యా వృతం వర మశోభనమ్॥,

..........................................

..........................................

హృతతేజా యథా సర్పో బభూవ జగతీపతిః" ॥.[44]

అని ఐదుశ్లోకాల్లో వుంది. దీన్ని వరదరాజు సంక్షేపించి ఐదు ద్విపద పంక్తుల్లో వ్రాశాడు.

"తన ప్రాణ సదృశుఁడౌ - తనయుని మీఁద
నాననెట్టిన వజ్ర - హతిఁబలె మేను
మ్రాను పడంగ సొ-మ్మసిలి మూర్ఛిల్లి
యవనిపైఁబడి మాట-లాడక యుండి
యవనీశ్వరుఁడు ధై-ర్య సహాయుఁ డగుచు"[45]

కైకేయి కోర్కెల్ని విన్న దశరథునకు' ఇంద్రియాలు స్వాధీనంతప్పి కైకెయితో ఏమీపలుకలేదు. ఆయన అప్రియాలు పలుకుచుండే కైకేయిని కోపంతో చూశాడు. వజ్రంవలె కఠినమై, మనస్సుకు అప్రియమైన కైకేయి కోర్కెల్నివిని దశరథుడు ఎంతమాత్రం సహించలేక పోయాడు. ఆయన కైకేయి నిశ్చయాన్ని తానుచేసిన ప్రతిజ్ఞను తలచుకుని మొదలు నరికిన వృక్షంలాగా నేలపై పడ్డాడు. అప్పుడు దశరథ మహారాజు, ' మనస్సు నశించిన వానివలె, పిచ్చి పట్టిన వాని విధంగా సన్నిపాతంచే భేదించిన ప్రకృతి గలవానివలె, వ్యాధి తునిలాగా, మంత్రబలంవల్ల నిర్వీర్యమైన సర్పంవలె కనపడుతుండె' నని మూలకర్త వ్రాశాడు.

ఈ విషయాన్ని వరదరాజు సంక్షేపించాడు. రాముణ్ణి అడవికి పంపాలని కైకకోరడంతో దశరథుడు 'వజ్రహతునివలె మేను మ్రానుపడగా సొమ్మసిల్లి, మూర్ఛిల్లి, అవనిపైబడి, మాటలాడకయుండి కోరలూడ్చినబుసకొట్టు సర్పంబులాగ వుండెన' ని వరదరాజు తెల్పాడు.

దశరథుని విషాదాన్ని వరదరాజు సంక్షేపించాడు. విషాదాన్ని విపులీకరించి చెప్పడం వరదరాజుకు అంతగా రుచించినట్లులేదు. కాని ఇక్కడ దశరథుని పరిస్థితిని విపులీకరించి చెప్పుటయే సమంజమనిపిస్తుంది. కాని క్లుప్తీకరణలో కూడా వరదరాజు కొంత స్పష్టతను చూపి పాఠకునికి దశరథుని ఆవేదనను నిరూపించాడు.

2) రాముడు అడవులకుపోతూ, తనతల్లి కౌసల్యను బాగా చూచుకొమ్మని తండ్రికి చెప్పే విషయం మూలంలో

"శ్లో|| ఇయం ధార్మిక! కౌసల్యా మమ మాతా యశస్వినీ |
వృద్ధాచాక్షుద్రశీలా చన చ త్వాం దేవ! గర్హతే ||.
మయా విహీనాం వరద! ప్రపన్నాం శోకసాగరమ్|,
అదృష్ట పూర్వవ్యసనాం భూయ స్సమ్మన్తు మర్హసి||,
పుత్ర శోకం యథా నర్చే త్త్వయాపూజ్యేన పూజితా|,
.......................................
నజీవితం న్యస్యయమక్షయం వ్రజేత్" ||.[46]

నాలుగు శ్లోకాల్లోవుంది. దీన్ని వరదరాజుకవి తగ్గించి వ్రాశాడు.

"ఓదేవ! మాతల్లి - యున్నది నీదు
పాద పద్మంబులు - భక్తిఁ గొల్చుచును
ఏను వనంబుల - కేఁగిన వెనుక
దీనయై మిగుల నా-ర్తి వహింపనీక
కైకేయిఁ జూపకఁ - గరుణనొంగాము
లేకడం జూడక - యేవచ్చు దనుక
ప్రాణముల్ మేనిలోఁ - బట్టుకయుండఁ
బ్రాణదానముచేసి - పనుపుమునన్ను
అభయ హస్తమొసంగుఁ-డ ..........."[47]

'ధార్మికుడవైన దశరథమహారాజా! నాతల్లి కౌసల్యా కీర్తిమంతురాలు, వయస్సుమళ్లింది. ఉత్తమ స్వభావంగలది. నీవు నన్ను అడవులకు పంపుచున్నా ఆమె నిన్ను నిందింపకుండావుంది. నీవు వరాలిచ్చు వాడవు. నేను పోయినపిదప, దుఃఖసముద్రంలో పడివున్నట్టిదీ, మునుపెన్నడూ దుఃఖాన్ని అనుభవించి యెరుగనిదీ అయిన నాతల్లి కౌసల్యను నీవు గౌరవించాలి. పూజ్యుడైన నీవు ఆమె పుత్ర దుఃఖాన్ని పొందకుండా చూచుకోవాలి. ఈమె నన్ను తలచుకుని నీ ప్రాపున బ్రతకాలి.

వింకను నా కీరేడు భువనముల
నెదు రెవరని? ప్రశ్నింపుచు నిలిచితి!!

రాజాంతఃపుర మందు నశోకపు
రాజవనంబున జానకిఁ గాంచుమ!
రాజేంద్రుం డగు రామస్వామికి
నా జయవార్తను గొని వినిపింపుమ!!

అని లంకయు శాపవిమోచిత యై
తన దారిని గొని చనె నంబరమున!
విని రాముని దాసుఁడు ముందు పనికి
వెడలెను మున్ముందుకు సంబరమున!!

హయప్రచార రగడ

రామచంద్ర - రాఘవేంద్ర!
ప్రేమమూర్తి - శ్రీయుపేంద్ర!!

కామజనక - కంజనయున!
శ్యామలాంగ - శరధిశయన!!



రామాభిషేకం చూడాలని వచ్చిన జనం అయోధ్యలోని రాజమార్గాల్లో గుంపులు గుంపులుగా చేరి వుండటం వల్ల ఆమార్గాలు ఇరుకైనాయి. ఆజన సమూహం యొక్క ఒరయికవల్ల, వారి సంతోషంవల్ల కలిగిన ధ్వని సముద్రంలోని ధ్వని వలె వుంది. ఆ పట్టణంలోని రాజ మార్గాల్లో అక్కడక్కడ అరటిచెట్లు, పోకచెట్లు అలంకారార్థంగా కట్టబడ్డాయి. ప్రతి గృహంలో ధ్వజాలు ఎత్తబడినాయి. అయోధ్యలోని ప్రజలందరు తమ కార్యకలాపాల్ని వదలి, రామాభిషేకం చూడాలని సూర్యోదయం ఎప్పుడవుతుందా? అని ఎదురు చూశారు. ప్రజలకు అలంకారం కల్గించేది, జనులకు సంతోషం కలిగించేది అయిన అయోధ్యలో జరగబోయే రామాభిషేకం చూడాలని జనులందరు ఇష్టపడ్డారు. వసిష్ఠుడు జనులచే నిండివుండే రాజమార్గాల్ని చూస్తూ, ఆజన సమూహాన్ని అక్కడక్కడ వ్యూహాలుగా పన్ను వానివలె మెల్లగా రాజగృహానికి పోయె' నని మూలకర్త తెల్పాడు.

వరదరాజు ఈ విషయాన్ని సంక్షేపించి రచించాడు. 'అయోధ్యాపురంలోని వీథుల్లో పచ్చలతోరణ పంక్తులు కట్టి, చెఱుకుగోలలు, పోకచెట్లను, పండ్లుగల అరటి మ్రాకుల్ని ద్వారాలుగా కట్టి, మేరువులుకురుజులు, మిన్నంటే పువ్వుదేరులు, మేల్కట్టు తెరలు అమర్చి, కెలంకుల గలయ కెక్కంబు లెత్తించి, కలయంపి చల్లి శృంగారించే జనుల కోలాహలం ఘోషించే సముద్రం వలె వుంద' ని వరదరాజు వ్రాశాడు.

మూలంలో కనిపించే అయోధ్యానగర జనుల ఆనంద కోలాహలం అనువాదంలో మరుగైంది. మూలంకన్నా అనువాదంలో అయోధ్యానగర అలంకరణ విస్తృతమైంది. ఆకుదింపు, ఈ విస్తరణ అనువాదానికి కొంత లోపమనే చెప్పవచ్చు. నగరాలంకరణ దశరథుని దర్పానికి నిదర్శనం కావచ్చు. రామపట్టాభిషేకానికి కావలసింది అదికాదు. రాముడు రాజైతే ప్రజలు పొందే ఆనందాన్ని చెప్పడం ఇక్కడ ముఖ్యం. అది మూలంలో తగిన స్థానంలో ఉండగా ఎందుకో అనువాదంలో కొంత సంక్షిప్తత చోటుచేసికొనింది.

4) అడవుల్లో వుండే నదులు, పర్వతాలు, వృక్షాలు రాముణ్ణి సంతోష పెడ్తూ వుంటాయని మూలకర్త ఆరు శ్లోకాల్లో రచించాడు.

" శ్లో|| ఆపగాః కృతపుణ్యాస్తాః పద్మిన్యశ్చ సరాంసిచ |,

......................................

......................................

విదర్శయన్తో వివిధా న్భూయ శ్చిత్రాం శ్చ నిర్ఝరాన్" ||.[50]

పున్నురాలిని సీత వెదకుచుఁ
బోవుచుండెను మెల్ల మెల్లన!!

కోటలను బేటలను బాటలఁ
దోటలను బుష్పవాటికలను!
దాటుచును మిద్దెలను మేడల
ద్వారములఁ గక్షల గృహములను!!

అశ్వగోహస్తిగశాలల
యజ్ఞశాలల హోమశాలల!
విశ్వతోముఖుఁ డగుచు నంతట
వెదకఁ జొచ్చెను వేదశాలల!!

పానగృహములస్నానగృహముల
బహుళ మగు క్రీడాస్థలంబుల
గానవృత్యాలయములను బహు-
కాముకుల కేళీవనంబుల!!

వివిధధనధాన్యనిలయములను
విపణివీధులను బరికించుచుఁ!
బవిబలుఁడు శస్త్రాస్త్రములు గల
భద్రభవనముల గమకించుచు!!

జనుచు నుండెను గాని జానకి
జాడ నింతయు గాన కుండెను!
ననిలతనయుఁడు ముందు కేగుచు
నాశ మాత్రము వీడ కుండెను!!

## రావణాంతఃపురవర్ణన

**విజయభద్రరగడ**

ఆకాశచుంబనము - నందుకొను ననెడు బహు-

హర్మ్యములు చెన్నొందు - నా సౌధమధ్యగము!
ప్రాకటంబుగ రవి - ప్రభల నీనెడు రాజ-
ప్రాసాదమును గనెను - బవనజుడు, దుర్గమము!!

కమలదళమధ్య బం - గారు వన్నెల నీను
కర్ణికవిధంబునబ్ర - కాశించుచుండె నది!
కమనీయరుచిఁ దార - కాకాంతలకు నడుమ
కుముదాప్తుని విధమ్ము - కొలువుదీ రుండె నది!!

పహరాలు సల్పు వర - భద్రాంగనాయుతము
వారిజేక్షణలకును - వామాంగులకు హితము!
బహుళశుకశారికా - పక్షిగణవిలసితము
వరభరద్వాజ శిఖి - పారావతసహితము!!

అగరు పునుగు జవాదు - లత్తరులు పన్నీరు
లాదుల సువాసనలు - నలరుల సుగంధములు!
దగవులాడుచు నుండెఁ - దమలోన దాము బి-
త్తరిలి కాంచగఁ బుష్ప - దామముల భ్రమరములు!!

మణిదీపరుచు లాభ - రణకాంతులును రార
మణుల మోము లను తా - మరల దీప్తుల గలసె!
గణనీయములు దార - కానాథతారకా
గణదీధితుల మ్రింగు - నన దిక్కులను వెలసె!!

**హరిణగతిరగడ**

అట్టి రాజాంతఃపురంబున
హనుమ వెదకుచుఁ బోవు చుండెను!
గట్టెదుటి దృశ్యంబు గని తన
కన్నులను దా నమ్మ కుండెను!!

మహోమరాళగతిరగడ

జవరాంద్రును సర్వాంగసుందరులు
సమసార్వావయవులు తలోదరులు
నవరత్నకనకభూషభూషితలు
నానాసుమవసనాలంకృత లా-
సవమదమదిరాక్షులు మధుమధురే-
క్షణలును ముదితలు శ్రీగంధాంగులు
వివిధవాద్యములు మేళవించు కొని
విభునిం బాడుచు నలసిరి సొలసిరి !
వివశలు సొక్కుచు సోలుచు పరిసర
విస్మృత లై తమతమ సాధనముల
గవువిగిలించి కాంతుని కాంతుని ప్రియ
గవుగిలి యని సుఖ మందుచు నిద్దుర
కవుగిటఁ జేరిరి తత్క్షణమున నే
కాలము దేశము మఱచిరి చిత్తా-
రువుల యందుఁ జిత్రితములు సిత్రము-
లో యన వారలు నిలిచిరి పొలిచిరి!!

హరిణగతిరగడ

మత్తకాశినులను సుమదిరా
మత్తలను నరదిసమొలలఁ గని!
చిత్తువడక యె యుండె హరి హరి
దత్తచిత్తుం డగుడు బావని!!

ద్విరదగతిరగడ

చంచలుని పుత్రుండు - చంచలు డచంచలుఁడు!
పంచబాణారిభవు - భవ్యాంశసంభవుఁడు!!

చంచలాపతిదాస - జనమౌనిమానసుఁడు!
ఎంచి చూడగ మదన వంచితుఁ డగున ఘనుడు!!

విజయభద్రరగడ

పావని గనియె రత్న - భర్మవిరచితరమ్య
భద్రసౌధమునమృదు - భవ్య పర్యంకగతు!
రావణునిఁ బట్టంపు - రాణి మందోదరీ
రమణీసహితు దనుజ - రాజేంద్రు దైవహతు!!

ఆ పడతి సీతయే - యని తలచి కపివరుఁడు
వ్యామోహమును బొందె - నాక్షణమె తెలి వొందె!
పాపపరిహార సం - ప్రాప్తికై రాఘవ
స్వామిని దలంచి ప - శ్చాత్తాపమును జెందె!!

ఘోరదర్శనుఁ డైన - కుంభకర్ణుడు నగా
కారుండు నిద్ర - ఘనగర్జ యన గుఱువెట్టు!
జేరఁ జని యచటఁ గపి - శేఖరుం డాతనికిఁ
జేరువ నిలిచి కన వి - చిత్రంబు సూపట్టు!!

మారుతి యు నుచ్ఛ్వాస - మార్గమునఁ జిక్కువడి
దూరుకొనియెను నాసి - కారంధ్రగుహ యందు!
జారిపడె నతని ని - శ్వాసమార్గమునఁ బడి
తేరుకొని తీవ్రగతిఁ - బారెఁ దత్‌క్షణ మందు!!

విభీషణునినగరు

సాగుచును ముందునకు - సజ్జనుడు సౌహృదుడు
సర్వహితుఁ డగు విభీ - షణుని నగరును గనెను!
త్యాగధనుల విశుద్ధ - తత్త్వభక్తుల సత్క-
థాలాపములును గీ - ర్తనలు భజనలు వినెను!!

స్వాగతము మీకు సు - స్వాగతము రారండు
భక్తులారా మీది - స్వగృహ మిది యనుకొండు!
బాగుగా నుంటిరే - భజన లొనరించు డని
ద్వారమునఁ గీరములు - స్వస్తి వలుకుచు నుండు!!

అది గని విభీషణుం - డర్ఘ్య పాద్యాదు లిడి
యత్యంతభక్తితో - నభివాద మొనరించి!
మది హర్షమునఁ బొంగ - మాన్యు నభిమత మెఱిగి
మనవి యిటు సేసె హను - మను గురువుగ వరించి

మరాళగతిరగడ

భాగవతులు వత్తురు భక్తుల కై
వేగముగా హృదయములు ద్రవించగ!
నేగుదెంచు ధేనువు లంబా యని
లేగల కొఱకై పాలు స్రవించగ!!

దర్శనము పుణ్యదము, సాధుజన
స్పర్శ పాపహరము, సంభాషణము!
దర్శన మొనరుచు మనమును, మీసం-
దర్శనము నిదర్శనము, తోషణము!!

కోటిజన్మసుకృతమున మిమ్ము గనుఁ-
గొంటి నిపుడు మీ యంతేవాసుడ!
నేటికి ధన్యుడ నను(గహించుడి
నే మీ దాసుల దాసుల దాసుడ!!

# హనుమద్విజయము

చంచలాపతిదాస - జనమౌనిమానసుఁడు !
ఎంచి చూడగ మదన వంచితుఁ డగున ఘనుడు!!

## విజయభద్రరగడ

పావని గనియె రత్న - భర్మవిరచితరమ్య
భద్రసౌధమునమ్మరు - భవ్య పర్యంకగతు!
రావణునిఁ బట్టంపు - రాణి మందోదరీ
రమణీసహితు దనుజ - రాజేంద్రు దైవహతు!!

ఆ పడతి సీతయే - యని తలచి కపి వరుఁడు
వ్యామోహమును బొందె - నాక్షణమె తెలి వొందె!
పాపపరిహార సం - ప్రాప్తికై రాఘవ
స్వామిని దలంచి ప - శ్చాత్తాపమును జెందె!!

ఘోరదర్శనుఁ డైన - కుంభకర్ణుడు నగా
కారుండు నిద్ర - ఘనగర్జ యన గుఱువెట్టు!
జేరఁ జని యచటఁ గపి - శేఖరుం డాతనికిఁ
జేరువ నిలిచి కన వి - చిత్రంబు నూపట్టు!!

మారుతి యు నుచ్ఛ్వాస - మార్గమునఁ జిక్కువడి
దూరుకొనియెను నాసి - కారంధ్రగుహ యందు!
జారిపడె నతని ని - శ్వాసమార్గమునఁ బడి
తేరుకొని తీవ్రగతిఁ - బారెఁ దత్‌క్షణ మందు!!

## విభీషణునినగరు

సాగుచును ముందునకు - సజ్జనుడు సౌహృదుడు
సర్వహితుఁ డగు విభీ - షణుని నగరును గనెను!
త్యాగధనుల విశుద్ధ - తత్త్వభక్తుల సత్క-
థాలాపములును గీ - ర్తనలు భజనలు వినెను!!

స్వాగతము మీకు సు - స్వాగతము రారండు
భక్తులారా మీది - స్వగృహ మిది యనుకొండు!
బాగుగా నుంటిరే - భజన లొనరించు డని
ద్వారమునఁ గీరములు - స్వస్తి వలుకుచు నుండు!!

అది గని విభీషణుం - డర్ఘ్య పాద్యాదు లిడి
యత్యంతభక్తితో - నభివాద మొనరించి!
మది హర్షమునఁ బొంగ - మాన్య నభిమత మెఱిగి
మనవి యిటు సేసె హను - మను గురువుగ వరించి

మరాళగతిరగడ

భాగవతులు వత్తురు భక్తుల కై
వేగముగా హృదయములు ద్రవించగ!
నేగుదెంచు ధేనువు లంబా యని
లేగల కొఱకై పాలు స్రవించగ!!

దర్శనము పుణ్యదము, సాధుజన
స్పర్శ పాపహరము, సంభాషణము!
దర్శన మొనరుచు మనమును, మీసం-
దర్శనము నిదర్శనము, తోషణము!!

కోటిజన్మసుకృతమున మిమ్ము గనుఁ-
గొంటి నిపుడు మీ యంతేవాసుడ!
నేటికి ధన్యుడ నను గ్రహించుడి
నే మీ దాసుల దాసుల దాసుడ!!

పాత్రను గని హరి యుపదేశించెఁ బ-
విత్రరామమును భవము దాటుటకు!
ధాత్రినిఁ గావలయును గాదే! సు-
క్షేత్రము సద్బీజములు నాటుటకు!!

## రామతత్త్వోపదేశము

### ద్విరదగతిరగడమాలలు

కామితార్థము లిచ్చు - గల్పకము రాముండు
ప్రేమలను గురిపించు - బ్రియతముఁడు రాముండు

కామాది రిపుహనన - కార్ముకుఁడు రాముండు!
కామమోహితరుచిర - గాత్రుండు రాముండు!!

నామసాహస్రుం డ - నామకుఁడు రాముండు!
నామసాధ్యుం డమృత - నాముండు రాముండు!!

పామరతమము వాపు - భానుండు రాముండు!
నేమముగఁ బాలించు - నిపుణుండు రాముండు!!

పాపపర్వత వజ్ర - పాణి రఘురాముండు!
తాపసుల నేలు ప్రియ - దైవంబు రాముండు!!

తాపముల నార్పు జల - దంబు ఘనరాముండు!
శాపముల దీర్చు బహు - శక్తుండు రాముండు!!

ఆపదాంబుదములకు - ననిలుండు రాముండు!
కోపాహిగరుఁడు డ - క్రోధనుఁడు రాముండు!!

### ద్విరదగతిరగడ

ఫణిశాయియు నపార - ఘృణశరధి రాముండు!
రణశూరుఁ డసురవా - రణహరియ రాముండు!!

మాయావి యును నతఁ - డమాయికుఁడు రాముండు!
మాయానటుఁడు వశ్య - మాయికుఁడు రాముండు!!

కన్ను తెఱచిన సృష్టి - గలిగించు రాముండు!
గన్ను మూసిన సృష్టి - గననీడు రాముండు!!

ఆత్మ రాముం డంత - రాత్మయును రాముండు!
ఆత్మ పరమాత్మ స - ర్వాత్మ యును రాముండు!!

అంతర్బహిర్గతుఁ డ - నంతుండు రాముండు!
అంతయును రాముఁ డణు - వణువుయును రాముండు!!

చర్మచక్షుల కగో - చరుఁడు హరి రాముండు!
నిర్మలహృదయముకుర - నిలయుండు రాముండు!!

ద్విరదగతిరగడమాల

గురుకటాక్షము ద్వార - గురి సూపు రాముండు!
గుఱుతు నిడి తన దరికిఁ - గొను విజయ రాముండు!!

దరహాసచంద్రికల - దళుకు లీను ముఖమ్ము!
పరమామృతప్రేమ - భరిత మా హృదయమ్ము!!

శరణాగతాళిర - క్షకుఁ డతని బిరుదమ్ము!
గురుణాకటాక్షవీ - క్షణ మతని యందమ్ము!!

మరాళగతిరగడ

సగుణుఁడు నిర్గుణుఁడు గుణాతీతుఁడు-
నగణితసుగుణోపేతుఁడు రాముఁడు!
జగదభిరాముఁడు మేఘశ్యాముఁడు-
నిగమాంతప్రతిపాదుఁడు రాముఁడు!!

చరణకర్త విహీనుఁడు శ్రీరాముఁడు-
చరియించు గ్రహించును జయరాముఁడు!

పరమాత్ముఁడు శ్రోత్రనేత్రరహితుఁడు-
నిరవుగ విను గను జయజయరాముఁడు!!

యాగావనుఁ డీ సీతారాముఁడు-
త్యాగధనుఁడు కౌసల్యారాముఁడు!
యోగిహృత్థ్సితుఁడుదశరథరాముఁడు-
భోగిదశముఖవిరాముఁడు రాముఁడు!!

దిఙ్మాత్రంపుఁ బ్రదర్శనీయుఁడు న-
వాఙ్మానస గోచరుఁడును రాముఁడు!
ఋఙ్మంత్ర ప్రస్తుత్యుఁడు పుంసాం-
దృఙ్మోహన రూపుఁడు రఘురాముఁడు!!

విముఖులకును దిర్యఙ్ముఖులకు నూ-
ర్ధ్వముఖుల కందదు రాముని తత్త్వము!
సుముఖుల నభిముఖముఖులను భక్త-
ప్రముఖులఁ జెందును రాముని సత్వము!!

రాముని సత్తావిద్యుత్తు వెలుగ-
రాజిల్లెడు నీ జగన్నాటకము!
రాముని సత్తావిద్యుత్తు మలుగ-
రహిచెడి చను నీ జగము బూటకము!!

రాముఁడు దృక్కును సాక్షియు సత్యము-
రాముని సతి సీతయె యీ దృశ్యము!
రామదూత హనుమంతుఁడు దర్శన-
మీ మానవుడే త్రిపుటి యవశ్యము!!

దృక్కు రూపమై వెలసిన తానే-
దృశ్యరూపమై తనరిన తననే!

చొక్కించు దర్శించును గాదే! తాఁ
జూచుఁ దనను దర్శనమున వలెనే!!

వినయవిధేయుఁడు విశాలహృదయుఁడు
విభీషణుని కై రాముని తత్త్వము!
హనుమంతుఁడు బోధించుచుఁ గృప ని
ట్లని యెఱిగించును నామమహత్త్వము!!

మహామరాళగతిరగడ

"దాసోహ" మని స్మరింత్రు రక్తులగు
ద్వైతులు, భక్తవరులు, జ్ఞానులును, స-
దా 'సోహ' మని స్మరింత్రు విశిష్టా-
ద్వైతు, లిహవిరక్తులు, విజ్ఞానులు!
ఈ సారరహితసంసారము దా
టించు రామనామామృతపూరిత
కాసారహంస "లహ" మని యాత్మను-
గనియెద రద్వైతులు, ప్రజ్ఞానులు!!

హరిగతిరగడ

అష్టాక్షరి యందలి "రా" తోడ వి
శిష్టము పంచాక్షరిఁ గల "మ" గలసె
నిష్టం బగు రామమహామంత్రము
సృష్టిని సర్వశ్రేష్ఠ మన వెలసె

మహామరాళగతిరగడ

సాధన చేత సుదీర్ఘకాలమున-
సాధ్యం బగు వైష్ణవ మష్టాక్షరి -
సాధన చేతను దీర్ఘకాలమున-
సాధ్యం బగు శైవము పంచాక్షరిఁ

జలములు నించుని-ర్జలవారి నిధుల
నిల మిన్ను గావించు-నిలసేయు మిన్ను
నెల నినునిగఁజేయు-నెల సేయు నినుని
పగలు రేలును రేలుఁ-బగలును జేయు
జగతిపై నతనిక-సాధ్యముల్ గలవే?
తలఁచిన విశ్వమెం-తయు వినిర్మించి
మలఁగించు విశ్వంబు-మాట మాత్రమున
నరికట్టు వాయువు-నల్లాడకుండ
గురివెట్టు జమునిము-క్కున మషీ రేఖ."[67]

'రాముని బలపరాక్రములు సామాన్య మైనవి కావు. తనబాణాల్తో నదీప్రవాహాలనైనా నిలువరింపగలడు. నక్షత్రగహావళిని, ఆకాశాన్ని తన అమ్ములతో ఛేదించగలడు. తనకరాగ్రంతో పాతాళంలోకి క్రుంగి పడిపోయే భూతలాన్ని కూడ నిలపగలడు' - అని మూలంలోని మొదటి రెండు శ్లోకాల భావాన్ని మాత్రం వరదరాజు యథాతథంగా అనువదించి ఆపై అనువాదంలో బాగాపెంచి రచించాడు. 'రాముడు సముద్రాల్లో నీళ్లులేకుండా ఇంకించగలడు. భూమిని ఆకాశంగా, ఆకాశాన్ని భూమిగా చేయగలడు. చంద్రుణ్ణి సూర్యునిగా, సూర్యుణ్ణి చంద్రునిగా మార్చి వేయగలడు. పగలురేయిగా, రేయిని పగలుగా చేయగల'డు. అనే వాక్యాలు అమూలకములు. మూలంలోని నాలుగవశ్లోక భావాన్ని ఇలా 'రాముడు తలచుకుంటే విశ్వాన్ని ఒక్కక్షణంలో అంతరింపచేసి మళ్లీపునర్మించగలడు తన సామర్థ్యంతో గాలిని కదలకుండా చేయగలడు' అని వరదరాజు పెంచాడు.

వాల్మీకి రాముడు శక్తి సంపన్నుడు. బలపరాక్రమాల్లో ఆతనికతడే సాటియని వాల్మీకి వర్ణించాడు. వరదరాజు ఇంకా కొంత ముందుకు వెళ్ళి రాముడు కేవలం పరాక్రమవంతుడేకాక సృష్టికి ప్రతిసృష్టి చేయగల మంత్రద్రష్ట- అని పేర్కొన్నాడు. పగలును రేయిగా, రేయిని పగలుగా, భూమిని ఆకాశంగా, ఆకాశాన్ని భూమిగా, సూర్యుణ్ణి చంద్రునిగా, చంద్రుణ్ణి సూర్యునిగా మార్చడానికి కావల్సింది బల పరాక్రమమే కాక మంత్ర శక్తి అవసరం.

యుద్ధంలో సామాన్యంగా శస్త్రాల్ని ఉపయోగిస్తుంటారు. శస్త్రంశరీర దార్ఢ్యంతో ప్రయోగించేది. అస్త్రం మంత్ర పూర్వకం. వరదరాజు రాముడు శస్త్రాస్త్ర ప్రయోగాల యందు మిక్కిలి నేర్పరి - అని రావణుడికి అకంపనుడు చెప్పినట్లుగా గ్రహించవచ్చు.

మరాళగతిరగడ

ఎంచి చూడ రాముని నామము జో-
డించ వలయు శ్వాసలతో సతతము!
పెంచును నానందంబును నది ర-
క్షించును సార్థక మగును జీవితము!!

సర్వదేశ కాలావస్థలలో
సర్వ జనులకు ననుస్మరణీయము!
నుర్విని శ్రేయము ప్రియము నొసగును
సర్వారిష్టహరము వరణీయము!!

సాక్షిగాను లోకవ్యవహారము
సమభావంబున రాగరహితముగ!
వీక్షించుచు సల్పిన చో కరమయుఁ
బీడించదు జరుగును నీ హితముగ!!

అని దానవు నానందపరవశుని
హరిభక్తుఁ గృపాపాంగదృష్టిఁ గనె!
వినమిత శిరు శిరమున శుభకర మిడి
వనచరర్షభుఁడు ముందునకుఁ జనె!!

విజయభద్రరగడ

ఆకాశగంగ లో - హంస యీదిన యట్లు
రాకాసుధాకరుఁడు - రమ్యగతిఁ జను చుండె!
చీకాకు జారిణీ - స్త్రీలు చోరులు వడగ
లోకాల తాపాలు - లుప్తపఱుచుచు నుండె!!

నావలకు నై ప్రయా - ణమున దీప గృహంబు
త్రోవ చూపించు క్రియ - దోహదపడుచు నిల్చె!

ధావళ్యకాంతి తో - ధగధగ మెఱయుచు శశి
పావనికి నై మహో - జ్వలదీప మై పొల్చె!!

ఆ విభీషణుని సతి - యైన సరమాదేవి
సాదరోచితగూఢ - సంజ్ఞానుసారంబు!
పోవుచును దనది యగు - బుద్ధిలోఁ దలపోసె
నీ విధము మాయ యా - నిదియ సంసారంబు!!

గ్రుడ్డి కొంగల తోడఁ - గూడినది క్రౌంచంబు
విడ్డూర మిది లోక - విపరీత సంఘటన!
చెడ్డ వారలఁ గలసి - శ్రేష్ఠు లుండుట వింత
దొడ్డ వాఁ డనదగు చ - తుర్ముఖుని దిది ఘటన!!

వృషభగతిరగడ

సారసాక్షునిభక్తి మానస
సరసి సరసిజపుఁ దూండ్లను దిను
సారమతి యగు విభీషణహం-
సం బహో ! తన కంట నట్టుల!
సారహీనపు లంక యను కా-
సారమున రాక్షసాధము లను
సారసములను గూడి యీ సం-
సారసాగర మీదు నెట్టుల?!!
దేహగేహములను మఱచి ని-
ద్రించు కుంభశ్రవణతమమును,
దేహభావాతీతవిజితేం-
ద్రియవిభీషణధీరసత్త్వము,!
మోహబలమున నణచియును వై-
దేహి యను బుద్ధిఁ జెఱగొనియును
దేహలంకాపురము నేలును
దీనరావణరజస్తత్త్వము!!

## అశోకవనవర్ణనము

### విజయభద్రరగడ

ధీరుండు సూచె దే - దీప్యమానవనంబు-
దేవతాయోగ్యంబు - దివ్యం బశోకంబు!
భూరిసత్ఫలనమ్ర - భూరుహోపేతంబు-
పుష్పవిలసితలతా - భూజరాజయుతంబు!!

మధుమాసలావణ్య - మహిమాఢ్య సుందరము-
మధుపానమదమత్త - మధుపాళిఝుంకృతము!
మదవతుల కానంద - మయవిహారస్థలము-
మదనకేళీవిహిత - మలయానిలాస్పదము!!

శారిశుక కోకిలల - సంకులారావంబు-
శాఖామృగమృగశశి - సంచారయోగ్యంబు!
పారావతమయూర - బహుళచాతకచక్ర -
వాకసుచకోరాది - పక్షిగణవాసంబు!!

మకరకచ్ఛపమహా - మత్స్యాదిసలిలచర-
నికరముల కాహ్లాద - నిలయసరసిసహితము!
బకహంస కారండ - వబహువిధజలవిహగ
సకలజలజోపేత - సలిలాశయాశ్రితము!!

దీపమానవిలాస - దివ్యభవ్యసురత్న-
దాపితసువర్ణ చై - త్యగృహప్రకాశితము!
సోపానతీరమణి - శోభాప్రదీప్తస-
ద్వాపీతటాకకూ - పసరోవరాన్వితము!!

నారంగకదళిఖ - ర్జూరములు, జామిజం-
బీరద్రాక్షలును, క - ర్పూరదాడిమభూరి!

పారిజాతేత్యాది - భూరుహంబులు, కోవి
దారంబులును, దేవ - దారుతరువులు, నారి

కేళతక్కోలహిం - తాలతాలతమాల-
మాలకములు, రసాల - సాలములు, నందాల!
మాలతీమాధవులు - మల్లెమొల్లలు, చంప-
కాలు, విరజాజులును - గ్రాలు నచ్చటఁ జాల!!

గంధగజములు, సింధు - సైంధవంబులును, శ్రీ-
గంధతరువులను బవ - నాంధసంబులు మెదలు!
పందెములు గొని పరుగు - గుందేళ్లు, లేళ్లు బ-
హ్వాందముగ వనమృగపు - మంద లందునఁ గదలు!!

## సీతాసందర్శనము

### విజయభద్రరగడ

శోకరహితం బగు న - శోకవన మందు సువి-
వేకుండు చతురుండు - వీరుండు గనె భీత!
లోకమాతను త్రయీ - లోకైకసుందరిని
శోకస్వరూప సు - శ్లోకచరితను సీత!!

దీనను, గృశను, నేక - వేణి, మలినాంబరను
ధృతరామరూపస - ద్హృదయను, నధోముఖిని!
జానకిని శింశుపపు - ఛాయాగతను, మ్లాన-
సరసిజాస్యను, భూమి - జను రాము ప్రియసఖిని!!

రాజవరుఁడగు జనక - రాజసుత, బంక్తిరథ
రాజుస్నుష, శ్రీరామ - రాజసింహుని భార్య!
రాజముఖి, రాక్షసీ - రాజి సంవృత, దనుజ-
రాజు రావణుని వన - రాజసంస్థిత, నార్యఁ!!

గంటి సీతను నేడు - గంటి స్వస్థత, నన్ను-
గన్న మాతాపితలు - గడు ధన్యులై రిపుడు!
గంటి జన్మసఫలతఁ - గంటి రాముని దయలు
గార్యసిద్ధుడ నైతిఁ - గాంక్షదూరుడ నెపుడు!!

**తురగవల్గనగతిరగడ**

అనుచుఁ బులకి తాంగు డగుచు-
హర్షబాష్పనేత్రుఁ డాయె!
హనుమ యాత్మ లో వినమ్రు
డగుచు మిగులఁ బొంగిపోయె!!

నమగుఁబోడి యందమునకు
నమితముగను ముగ్ధుఁ డాయెఁ!
దనివిదీరఁ జూచి చూచి
తన్నుఁ దాను మఱచిపోయె!!

జననిజనకు లిరువురఁ దన
మనసు లోనఁ బోల్చుకొనియె!
మణులు నొకటి కొకటి తీసి
చన వని యిటు దల్చుకొనియె!!

**హరిగతిరగడ**

అందందునఁ దన సృష్టి నమర్చిన
యందంబుల నొక్కెడ సమకూర్చెను!
సుందరతమము, నపూర్వ మిథున మర-
విందభవుఁడు నే ర్పలర నొనర్చెను!!

**మరాళగతిరగడ**

శ్రీదేవియును నుమాదేవియును శ-
చీదేవియును రతీదేవి భార!
తీదేవియు సీతాదేవి సిరికి
నే దేవేరియు జాల దికఁ జేర!!

సీతారాముల యందంబుల లో
సీతయ? రాముల? యెవ్వారు మేటి?!
సీతారాముల యందంబులకుఁ-
సీతారాముల యందములె సాటి!!

మహామరాళగతిరగడ
భూమీసుతసుందరిసీతాసతి-
భూరిధూళిధూసరదేహద్యుతి
యే మాత్రము తఱుగక వెలుగును వెలి-
గించుచు నుండును జుట్టుప్రక్కలను!
హోమాగ్నిప్రజ్వలజ్జ్వాలామ-
హోజ్వలకాంతులు ధగధగలాడుచు-
ధూమావృతములు, నిష్కల్మషములు,-
దోషరహితములు నిండు, దిక్కులను!!

## రావణోద్యానవనసమాగమనము

విజయభద్రరగడ
రావణుఁడు గనెను మ - ర్కటకిశోరము గలను
రామసతి సీతను బ - రామర్శ సేయగా!
భావిసంఘటనల ద - ర్పణము లగునవి గొన్ని
స్వప్నము లొకొకయెడ ని - జంబు లై తనరుగా!!

అరయుగాఁ దగును స - త్యాసత్యముల నిపుడె
యటులె సీతను మాట - లాడించ వచ్చు నని!
బిరబిరను లేచె సం - ప్రీతమానసు డగుచుఁ-
దఱలె సురవైరి తత్ - క్షణమె యుద్యానవని!!

విజయభద్రరగడ
ఈలోన నంతిపురి - కెదురుగా వాద్యము ల-
నేకముల చప్పుళ్ళ - నింగితజ్ఞుఁడు వినుచుఁ
గోలాహలము సేర - గుప్పించి చెట్టెక్కి
గుబురు కొమ్మల చాటు - గూర్చుండెఁ గపి గనుచు!!

దివటీల వెలుగులో - దివ్యవసనాభరణ-
దేదీప్యకాంతి దశ - దిశ లెల్ల నిండగా!
జవరాండ్రు వరఛత్ర - చామరములు ధరించి-
స్వామిని విడక యతని - సన్నిధిని నుండగా!!

వందిమాగధులు స్తుతి - పాఠకులు ముం దుండి
ప్రభువు సత్కీర్తులను - వరుసగాఁ బాడగా!
మందగజయాన లా - మందోదరీ ప్రముఖ-
సుందరులు చుట్టు సర - సోక్తులను నాడగా!!

చారుదరహాసినులు - చపలత్వవిరహితసు-
శంపాలత లనంగ - సరస సేవింపగాఁ!
గారు మేఘ మనంగ - గంభీరరూపండు-
గదలె రావణుఁడు సుర - గణము గంపింపగా!!

భేరీపణవశంఖ - వీణామృదంగాది
వివిధవాద్యధ్వనులు - వెడలి దివి నిండంగ!
దారి చూపగ దండ - ధరలు భద్రాంగనలు
దశకంధరుఁడు సేరె - దర్ప ముట్టిపడంగ!!

మరాళగతిరగడ

కావలికత్తెలు లేచిరి నిలిచిరి-
కలవరమతు లై తలలను వాంచిరి!
సావధానములు వల్కుచు నుండిరి
జానకిని నుదాసీనను గాంచిరి!!

ఊరుజానువుల శరణము, నొందెఁ ద-
లోదరి యుదరము వక్షోరుహములు!
గ్రూరగృధ్రభయమునఁ దల్లి మఱుగు-
గొనును గదా కుక్కుటశాబకములు!!

సరిసూచితిని నాఁటి-శాపంబునకును
దరియౌట యభయపు-దానంబుఁజేసి
రక్షింపుఁడిక సంగ-రంబునం బడిన
రాక్షసులను మహిఁ-ద్రవ్వి పూడ్చుట యె
ధర్మంబుగా నటు-దలఁచిన యట్టి
కర్మంబు సేయుఁడేఁ-గనియెద ముక్తి"[77]

మూలంలోని విరాధుడు కుబేరుని వల్ల శాపం పొందిన తెరగును, రాముని ద్వారా శాపవిముక్తుడయ్యే విధానాన్ని తెలిపాడు. వరదరాజు విరాధుడు, 'మీారు రామలక్ష్మణులని తెలియక మీాతో యుద్ధం చేశాను. నీవు సకల సాధురక్షణ విచక్షణుడవు కాబట్టి నన్ను బాధించవద్దు. అభయ ప్రదానంచేసి రక్షింపు'మని ప్రాధేయపడ్డాడు. అలాగే తాను గంధర్వ జాతిలో ఉత్తముణ్ణి అని కూడ వరదరాజు విరాధుడు మరోవైపు తనను గూర్చి చెప్పుకొన్నాడు.

2) శరభంగమహామునిని బ్రహ్మలోకానికి తీసికొని పోవడానికి దేవేంద్రుడు ఆయన వద్దకు వచ్చాడు. ఆసమయంలో అక్కడేవున్న రాముడు దేవేంద్రుడు వచ్చిన సంగతిని గూర్చి శరభంగ మహామునిని అడిగాడు. అప్పుడు శరభంగుడు ఆసంగతిని రామునికి తెలపడం మూలంలో రెండు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| శరభంగ శ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్,|
మా మేష వరదో రామ! బ్రహ్మలోకం నినీషతి||
జిత ముగ్రేణ తపసా దుష్ప్రాప మకృతాత్మభిః,|
అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర! వర్తమాన మదూరతః||[78]

'రాముడా! నేను చేసిన ఉగ్రతపస్సు ఫలితంగా ఆత్మవేత్తలు కాని వారు పొందడానికి అలవికానిది అయిన బ్రహ్మలోకానికి నన్ను తీసికొని పోవడానికి వరాలుఇచ్చే దేవేంద్రుడు వచ్చాడు. నీవు ఇక్కడ దగ్గరనే వున్నావనితెలిసి ప్రియాతిథివైన నిన్నుచూడకుండా బ్రహ్మలోకానికి పోకూడదని ఆగి పోయాను'- అని శరభంగమహాముని రామునికి తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని యథాతథంగా తెనిగించాడు.

"శ్రీరామ! యెవ్వరి-చేత సాధింపఁ
గారాని సత్యలో-కము నాతపమున
సాధించుటనుఁ జేసి-జలజ సంభవుఁడు

ఆగ్రహానుగ్రహములకు దే-
వాళి యెప్పుడుఁ దలల నొగ్గ న
వగ్రహములను మెట్లు గా ది-
వ్యాసనము దీర్చితిని నిగ్గన!!

వాయుదేవుడు సుఖము గా వీ
వనలు లేకయె వీచు, ఘనముల!
సాయమున వరుణుండు నింపును
స్నానపానాదులకు జలముల!!

అనలు డెప్పటి కప్పు డే ది-
వ్యాన్నములు సిద్ధంబు సేయును!
ధనదు డెపుడును జాగరూకత
ద్రవ్యముల లెక్కలను వ్రాయును!!

దినవిశామణులు, దమ ప్రభలను
దీపములు వెలిగించు చుండును!
ననవరతమును నైరుతీశుం-
డసురక్షేమము సూచుచుండును!!

దండధరు డగు యము డెపుడు నా
దండనే సేవింపు చుండును!
దుండి గణపతి సావధానుఁడు
దోరణము రక్షించు చుండును!!

అంగరక్షణ సేయ నీశా-
నాధిపతి వెన్నంటి యుండును!
ఇంగితజ్ఞుఁడు పెద్ద యింద్రుం-
డేమరక సరిచూచు చుండును!!

అనుదినంబును సురగురువు ప-
ఞ్చాంగమును వినిపించవచ్చును!
మునివరుఁడు నారదుఁడు వార్తలు
మోసికొని నా కొఱకుఁ దెచ్చును!!

మీరలెక్కు డఁ జూచి - మేనిలో నాకుఁ
ప్రాణముల్ నిలువక - బల్లటిల్లెడును"[81]

- అని తెనిగించాడు.

'వైరంలేకుండానే అజ్ఞానివలె ప్రాణిహింసకు పాల్పడుతున్నా'వని మూలంలోని సీత రాముణ్ణి నిందించింది. శ్రీరామాయణంలోని సీత ఒకసామాన్య మహిళలాగా, 'రాజ్యం ఒక్కరికి ఇచ్చి దండకారణ్యాల్లో అనాథల్లా తిరుగుతున్నాం. మనం ఒక్కరి కోసం రాక్షసుల్తో యుద్ధం చేయడమెందుకు'? అని బాధపడుతూ రామునకు హితవు చెప్పింది. అలాగే 'మీరు విల్లుఎక్కుపెట్టడం చూచి నా ప్రాణాలు తల్లడిల్లి పోతున్నాయి' - అని ఆమె స్త్రీ సహజమైన కాతరత్వంతో పలికింది.

2) మారీచుడు మాయలేడి రూపంతో రాముణ్ణి అరణ్యంలో బహుదూరం తీసికొని పోయాడు. రాముడు దానిని రాక్షసమాయగా భావించి ఆలేడిని బాణంతో కొట్టాడు. రామబాణం దెబ్బతిన్న (మాయ లేడిరూపంలో ఉన్న) మారీచుడు 'అయ్యోలక్ష్మణా!' అని కేక వేసి మృతి చెందాడు. సీతదానిని రామునికేకగా భావించి, లక్ష్మణుణ్ణి రాముని వద్దకు పంపుతుంది. తనవద్దకు వచ్చిన లక్ష్మణుణ్ణి చూచిన రాముడు 'సీతేమయ్యిందో'నని ఆందోళన చెందడాన్ని మూలకర్త ఈ విధంగా వ్రాశాడు.

"శ్లో|| సర్వథా రక్షసా తేన జిహ్మేన సుదురాత్మనా,|
వదతా లక్ష్మణేత్యుచ్చై స్తవాపి జనితం భయమ్.||
శ్రుతస్తు శఙ్కే వైదేహ్యా స స్వర స్సదృశో మమ,|
త్రస్తయా ప్రేషితస్త్వం చ ద్రష్టుం మాం శీఘ్ర మాగతః||
సర్వథా తు కృతం కష్టం సీతా ముత్సృజతా వనే,|
ప్రతికర్తుం నృశంసానం రక్షసాం దత్త మన్తరమ్"||[82]

'కపటి, దురాత్ముడు అయిన రాక్షసుడు 'లక్ష్మణుడా'! అని గట్టిగా నాకంఠధ్వనివలె అరవడం వల్ల సీత, నీవు భయపడినారు. సీతనిన్ను పంపగా నీవు శీఘ్రంగా నావద్దకు వచ్చావు. అడవిలో సీతను ఒంటరిగా వదలి రావడంవల్ల నీవు చాలా పొరపాటు చేశావు. క్రూరులైన రాక్షసులకు మనపై కక్ష తీర్చుకోడానికి ఇంతవరకు లేని అవకాశాన్ని ఇప్పుడు నీవు కల్పించావు' - అని రాముడు లక్ష్మణునితో అన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావానికి స్వతంత్ర కల్పన చేశాడు.

పతివ్రతాదృగనలమున
భస్మ మగుట కనర్హుడవు!
పతిరఘుపతిబాణాగ్నిని
బడి మడయుటకు నర్హుడవు!!

దునిమెడు నిను నీ బలముల
ననిమొన సీతావిభుండు!
గనియెడు నా సమయము కై
యనుజసహితు డతిరథుండు!!

మహాప్రవాళగతిరగడ

దనుజ దుష్టవనమృగములఁ
దరిమి తరిమి వేటాడుచు
వనము నేలుచుండును ద-
ర్పమున రామాశార్దూలము!
కనుమరుగునఁ జేరి పిరికి-
తనమున నెంగిళ్లు గూళ్లు
దినుటకు నాసపడును రా -
వణు డను నీచసృగాలము!!

హరిణగతిరగడమాల

ఓరి! రావణ యడవిలో న-
న్నొంటి దానిని, హావిని గొని శుని!
పారిపోయెడు విధము దెచ్చితి
పాపి యెదిరిచెదె జగదీశుని!!

వారిరాశిని దాటి రఘుపతి
వచ్చి నిను పరివారసహితునిఁ!
గ్రూరనారాచముల వధగొని
చేరఁబోవు నయోధ్య నను గొని!!

సుగ్రీవుడు, అతణ్ణి ప్రేమిస్తా'మని శ్రీరాముడన్నాడు. దానికి వాలి రామునితో బదులు పలికిన విషయం మూలంలో ఒకశ్లోకంలో వుంది.

"శ్లో|| శరాభితప్తేన విచేతసా మయా
ప్రదూషిత స్త్వం యదజానతా ప్రభో!
ఇదం మహేన్ద్రో పమ భీమవిక్రమ!|
ప్రసాదిత స్త్వం క్షమ మే నరేశ్వర! ||"[84]

'మనుష్యనాథుడవైన రాముడా! నీవు దేవేంద్ర సమానుడవు. మహాపరాక్రమ శాలివి. నేనునీ బాణంతో పీడింపబడి, తెలియక నిన్ను నిందించాను. అందులకు నేను చింతిస్తున్నాను. నన్నుమన్నించ'మని వాలి రామునితో చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని వైభావాన్ని పెంచిరచించాడు.

"జానకీ రమణ! ని-శాతసాయకము
చేనేసితివి రొమ్ము-చినిఁగి కూలంగ
నానొవ్వి యదియంత-యనరానిమాట
లేనిన్నుఁ బలికి నా-హృదయంబులోన
మిగులఁ దపించెద-మీ రవి మణివి
పగమాని నన్నుఁజే-పట్టుఁడుల్లమున
నాపట్టి బాలుఁడై-నను రవి తనయ
ప్రాపున మేనుడాఁ-పడ సంగరముల
మీపని పాటల-మెలగఁగ నేర్చు
నోపు నెంతటికైన-నోడఁడెవ్వరికి
వానికేమి గొఱంత-వాఁడు నీవాఁడు
జానకీరమణ! వి-చారమేమిటికి?
ఏ నెవ్వఁడను విశ్వ-మెల్ల రక్షింపఁ
బూనిన మీతోడఁ-బొసఁగఁ బల్కుటకు?"[85]

రామ బాణపీడితుడైన మూలంలోని వాలి తన కుమారుడైన అంగదుని భవిష్యత్తును గురించి ఆందోళన చెందలేదు. వరదరాజు వాలి తనకుమారుని భవిష్యత్తును గూర్చి రామునితో ప్రస్తావించాడు. 'నాకుమారుడు నీ వాడు అయినందువల్ల విచారించాల్సిన అవసరంలే'దని రామునితో తన కుమారుని భవిష్యత్తు పట్ల సంతృప్తిని వ్యక్తంచేశాడు.

ఉర్విజకు దనుజేంద్రు పై మరు-
లూర బోధలు సలుపఁ దొడగిరి!
సార్వభౌముని పైని యాశలు-
సడల్చఁజేయ మగువలు గడగిరి!!

## రాక్షస స్త్రీల బోధలు

### విజయభద్రరగడ

కందమూలా శనుఁడు-
గానననివాసుండు-
మందభాగ్యుండనభి-
మాని శ్రీనష్టుండు!
మందుండు దుర్బలుఁడు-
మానవుఁడ ధీరుండు-
నిందు రాలేడు వాఁ-
డెన్నటికి భ్రష్టుండు!!
అందచందముల న-
ప్పైశ్వర్య బలములం-
దెందు రావణరాజు-
కీడగు? నరాధముఁడు!
అందుకని ప్రభువు కే-
లందుకొను మాతండు-
అందుకొను నీ మృదు ప-
దాబ్జ మసురోత్తముఁడు!!
అని చెప్పి యెంతయును-
వినదు ధాత్రిజ వినదు-
పనికి రాకుండె గద -
పరమ నయ మార్గంబు!
దనదు కుందేలు పా-

భేరీమృదంగాది-బిరుద వాద్యములు
భోరుకలంగ నా-ప్తులు చేరి కొలువ
నావెన్క నంగదుఁ-డందలంబెక్కి
తావాలిహితులు చెం-తలఁగొల్చి రాఁగ
చెంగట దిడ్డు వై-చిన పల్లకీల
సంగడిఁ దారాది-సతులఁ దోకొనుచు
వానరసైన్య రా-వము నింగి ముట్టఁ"[87]

మూలంలోని సుగ్రీవుడు సాధారణంగా కిష్కింధాపురంలోకి ప్రవేశించి నట్లు వాల్మీకి తెలిపాడు. వరదరాజు, తనసుగ్రీవుడు 'అలంకరింపబడిన పల్లకీని బోయీలు తెచ్చివుంచగా, రాముని అనుమతిని పొంది అందులో ఎక్కి కిష్కింధకు పోయి'నట్లు వ్రాశాడు. అలాగే సుగ్రీవుడు కిష్కింధకు బయలు దేరినప్పుడు భేరీ మృదంగాది బిరుదవాద్యాల శబ్దం బోరుకలగింది. అతణ్ణి ఆప్తులు, తారాది సతులు కొలుస్తూరాగా సుగ్రీవుడు ఒక శుభముహూర్తాన కిష్కింధలో ప్రవేశించాడని వరదరాజు వ్రాశాడు. ఇది మూలంలోలేదు.

సుగ్రీవుడు కిష్కింధాపురానికి రాజు కాబట్టి రాజ్యంలోకి ప్రవేశించేటప్పుడు అతనికి హంగు ఆర్భాటం కల్పించడం యుక్తమని ఇక్కడ వరదరాజు భావించాడు.

### 2.4.2 మూలసంక్షేపాలు

1) వాలిదుందుభిని సంహరించి, అతనికళేబరాన్ని మతంగాశ్రమంలో పడవేయడంవల్ల మతంగ మహాముని వాలిని శపించడాన్ని గూర్చి సుగ్రీవుడు రామునికి తెలిపాడు. ఈ విషయం మూలంలో ఏడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| తం తోలయిత్వా బాహుభ్యాం గతసత్త్వ మచేతనమ్|,
.........................................
.........................................
వనం మత్సంశ్రయం యేన దూషితం రుధిరస్రవైః||"[88]

బలవంతుడైనవాలి, మృతి చెందినదుందుభి కళేబరాన్ని ఒక్క ఆమడ దూరంలో పడేటట్లు విసిరి వేశాడు. అట్లు విసిరి వేయడంవల్ల ఆదుందుభి నోటి నుండి వెలువడిన రక్తబిందువులు మతంగమహాముని ఆశ్రమంలో పడ్డాయి. దానితో కోపోద్రిక్తుడైన మతంగ మహాముని, తనపై నెత్తురు బిందువులు పడేవిధంగా చేసిన దురాత్ముడు, దుర్బుద్ధి, మూఢుడు, మూర్ఖుడెవ్వడు ? - అని దూషించాడు. ఆయన ఆశ్రమం

## త్రిజటా స్వప్న వృత్తాంతము

హరిగతిరగడ

సమ్మతి యుక్తత్రిజట యా రాక్షస-
సంఘతమోహర సన్నక్షత్రము!
ఉమ్మెతవనమం దోహో! వెలయుచు-
నుండుఁ దులసి మొ క్కొకటి పవిత్రము!!

అతివిహ్వలచిత్తకు భీతకు సీ-
తాంగన కనెను త్రిజట వెను జఱుచుచు!
మితి మీఱిన యాదరమున గరుణా-
మిళి తేక్షణముల ననునయ పఱుచుచు!!

సుత! నీ కించుక శాంతిని గూర్చెడు -
సుఖమయమత్స్వప్నవిశేషంబులు!
ధృతమతి! విను మారయగ నపరరా-
త్రి గను కలలు భువి శతధాని జములు!!

రాముడు పారావారము దాటెను-
లంకాపురమును భస్మ మొనర్చెను!
భ్రామితు డైన యసురపతి గోమయ-
హ్రదమున నగ్నుడు స్నానము దీర్చెను!!

రావణు నను జుండు విభీషణు డట -
రాజ్యం బేలెను లంకా పురమున!
దేవత లందఱు గురిసిరి ముదమున-
దివ్యసుమంబులు రాముని శిరమున!!

ఆ రాముఁడు లక్ష్మణ సంసేవితుఁ-
డై రావతమున సీతాసహితుఁడు!
చేరె నయోధ్యా పట్టణమును నభి-
షిక్తుం డాయెను నను జసమేతుఁడు!!

అని సీతును స్వాంతన పలుచగ దను
జాంగన లంతయు భయమున నినుమను!
జనిరి నిదుర యొడి నాడలులు మఱచిర-
సత్యం బీ సంసారం బనుచును!!

బాధలు మఱచియుఁ బ్రకృతి ప్రశాంతపు-
శ్వాసల నెల్లెడఁ బీల్చుచు నుండెను!
మైథిలి మానస మందున ఝంఝా-
మారుతములు గడు వీచుచు నుండెను!!

జానకి జీవిత నౌకయె యూగుచుఁ -
జావు బ్రతుకులకు మధ్యన నుండెను!
దీనావనుస్మృతి స్మృతినను మెదలగ-
దీన యిటులు దలపోయుచు నుండెను!!

## జానకీ పరిదేవనము

### హరిగతిరగడ

శ్రీరామా! యాశ్రిత పరిపాలా! -
సీతాపాంగేక్షణప్రియలోలా! ।
శ్రీరాజిత ఘనభర్మసుచేలా! -
శ్రీవక్షోజ స్పర్శిత మాలా! ॥

ఈ పరితాపము నోపను నాపై-
కోపమ, జన్మాంతరమునఁ దగిలిన
శాపమ, యిది లక్ష్మణు నిందించిన -
పాపమ, నీ విరహాగ్నిని రగిలిన!!

తాపమ, గట్టిగఁ జేఁబట్టితిరా-
నీ పదములు దాపసమందారా! ।
కాపాడర నిను శరణంటినిరా-
కరుణించర భక్తజనోద్ధారా! ॥

రావా? నను గొనిపోవా? యీ పా-
రావారము దరిఁ జేర్చవ? నీ వా!
రావణు నోడించను శక్తుండవు
కావా? కావగ లేవా? దేవా! ॥

నీవా రా విక నిజ మిది చా వను-
నావను వచ్చెదను బతితపావన! ।
భావము నందున నిల్పుము స్థిర మగు-
స్థావరమును నాకై సుజనావన! ॥

జానకి యిట్లని ఘనశోకాకుల-
మానస యై పరితాపము నొందెను!
నేనిక నొక క్షణ మేనియు నోపగ-
లే నని మిగుల నధైర్యము సెందెను!!

## వైదేహీ ప్రాణత్యాగోద్యమము

### మహా ప్రవాళ రగడమాల

ఎందును సంక్షోభంబును-
నేర్పరచిన పెను తుపాను -
నందుఁ జిక్కువడిన నావ -
చంద , మాయె సీత బ్రతుకు!
సందేహము లేదు కనుల -
బంధునిఁ బాసిన కనులము -
నందలి భృంగము భంగి న -
నిందిత గురియయ్యె నెతకు!!

అందములగు శుకపికా ళి-
బృందంబుల రవళులు విని-
యిందువదనవదనము వికా -
సించెను, వెలసెను గగనము!
అందందున శుభశకునము -
లగుపడు చుండెను సీతకుఁ-
దొందరపడు చుండె రాఘు-
వేంద్రునిఁ జేరుటకు మనము!!

'భరతుడు మునివేషం తాల్చి కష్టపడు తున్నందు వల్ల కలిగిన దుఃఖం, సీతాపహరణంవల్ల కలిగిన దుఃఖం ఈ రెండు తనను పీడుస్తున్నా'యని వాల్మీకి రాముడు తెలిపాడు. వరదరాజు రాముడు 'భరతవియోగం, భామావియోగం కలసి తనను మననిస్తాయా?' అని దిగాలు పడ్డాడు.

2) రామబాణం చేత హతుడైన తనభర్తయగు వాలికి నమస్కరించమని తారకుమారుడైన అంగదునికి చెప్పింది. తనతల్లి సూచన మేరకు అంగదుడు వాలికి నమస్కరించాడు. ఈ విషయంమూలంలో నాలుగు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| బాల సూర్యోదయ తనుం ప్రయాన్తం యమసాదనమ్|,
అభివాదయ రాజానం పితరం పుత్ర! మానదమ్||
ఏవ ముక్త స్సముత్థాయ జగ్రాహచరణౌ పితుః|
భుజాభ్యాం పీనవృత్తాభ్యా మంగదోஉహ మితి బ్రువన్||
అభివాదయ మానం త్వామంగదం త్వం యథా పురా|
దీర్ఘాయుర్భవ పుత్త్రేతి కిమర్థం నాభిభాషసే||
అహం పుత్త్రసహాయా త్వా ముపాసే గత చేతసమ్|
సింహేన నిహతం సద్యో గౌస్సవత్సేవ గోవృషమ్||"[94]

'కుమారుడా! యమ మందిరానికి పోతూ, ఉదయ సూర్యునిలాగా, అరుణగాత్రుడై ఉన్న వానరేశ్వరునికి నమస్కరించ'మని తార అంగదునితో చెప్పింది. అంగదుడు తనతల్లి మాటప్రకారం వాలికి తన పేరును తెలిపి అతని పాదాల్ని పట్టుకుని నమస్కారం చేశాడు. తారవాలిని వుద్దేశించి, 'అంగదుడు నీకు నమస్కారం చేయగా మునుపటిరీతిగా కుమారుడా! చిరాయువగుము. అని నీవు అతణ్ణి ఎందుకు ఆశీర్వదించలే'దని అడిగింది. 'సింహముచేత ఆక్షణమేహతమైన ఆ బోతును ఆవు, దూడ వదలకుండా సేవించినట్లు మృతిచెందుతున్న నిన్ను నేను, నాకొడుకు సేవిస్తున్నా'మని తారఅన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని యథాతథంగా అనువదించాడు.

"అదెకంటె! మీతండ్రి-యంతి మావస్థ
కనుఁగొంటివే వాలి-గాత్రంబు వెడలి
దినకర ప్రభనొక్క-దివ్యతేజంబు
చను చున్నయది నమ-స్కారంబు సేయు
మన విని యంగదుం-డతుల మ్రొక్కుటయు

స్వామి నీ విక రావు సత్యము-
చావు నా కొకటియె శరణ్యము!

ఏల? నాకై జలధి దాటుట -
యేల? దైత్యుల సంహరించుట!
యేల విక నీ కేల? దీనద-
యాళు వను బిరుదము వహించుట!!

రామ పదినెల లాయె నను గన -
రావు నాపై నీకునుం గల !
ప్రేమ లే మాయెను? బరాక్రమ-
విక్రమము లాయెగద! యొక కల॥

అనుచు మృత్యువు మాత యొడిలో -
హాయిగా నిద్రింప నెంచెను!
మనసు నీగల వలెను నాలో-
చనపరంపర లాక్రమించెను!!

మహాప్రవాళరగడ

నింగిఁ బండు నింగిల మని -
యంగారకునిం గాంచెను -
అంగార మొ కింత నాకు -
నవసర మని యర్థించెను
గంగాధర! విషధరధర!
కాలకంఠ! హర! నీ గళ-
సంగతగరళపు బిందు నొ-
సంగు మనుచు బ్రార్థించెను!!

శృంగారీ! విష్ణుదేవ! -
యంగజ జనకా! నీ దగు-
మంగళకరనందక మొక -
మా రిమ్మనెను వరాంగన।
పొంగుచు జీవుల జీవము -
లం గొనుచును బింకమునఁ జె -
లంగెడు పాశమ్మును యమ -
రాజు నడిగె వీరాంగన!!

'సుగ్రీవుడా! నీవు ముందుగా రాముని సహకారంతో నీకార్యాన్ని నెరవేర్చుకొని కృతార్థుడవయ్యావు. అటుపిమ్మట నీవు పల్కిన మాటప్రకారం రాముని కార్యం చెయ్యకుండా మాటతప్పావు. కాబట్టి నీవు దుర్మార్గుడవు. కృతఘ్నుడవైతివి. రాముడు నీకు చేసిన ఉపకారాన్ని నీవు మరవకుండావుంటే తగిన ప్రయత్నంచేసి సీతను వెదికింపవలెగదా!

కప్పలను మ్రింగడానికి సర్పం కప్పవలె అరచునట్లు, నీవు మొదట కార్యార్థమై సత్యవంతుడవుగా అభినయించి ఇప్పుడు గ్రామ్యములైన విషయ సుఖాలకు లొంగి ప్రతిజ్ఞ తప్పావు. నీవు దురాత్ముడవు, పాపిష్ఠుడవునని తెలియక రాముడు నీకు వానరరాజ్యాన్ని ఇచ్చాడు. రాముడు చేసిన ఉపకారాన్ని నీవు మరచినట్లైతే నిన్ను ఇప్పుడే వధించి వాలి వద్దకు పంపుతాను' - అని లక్ష్మణుడు సుగ్రీవుని దూషించినట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు మూలంలోని పైఖావాన్ని యథాతథంగా ద్విపదీకరించాడు.

"నిందకోరిచి రాము-నికి రెండు దలఁచి
కల్లాడిన నీకుఁ-గమల సంభవుడు
చెల్లరె! యెట్లుని-ష్కృతి విధియించు
సీతను వెదకింపఁ-జేపట్టెఁగాక
నీతోడు శ్రీరాము-నికి నేమిపనికిఁ
గప్ప పల్కినయట్లు-కాలాహి వల్కి
కప్ప నమ్మికఁ జేరఁ-గని మ్రింగినట్లు
నీకార్యమునకునై-నెయ్యంబు జేసి
వాకొంటి వప్పుడు-వలసిన యట్లు
వాలినిఁ జంపి నీ-వారమై రాజ్య
మేలించి నినుఁదెచ్చి-యింటిలోనునిచి
యిన్ని పాటులఁబడు-టెల్లను నీవుఁ
గన్నెలు నేవేళఁ-గలుద్రావి చొక్కి
కామాతురుండవై-కడపటు మమ్ము
నేమియుఁ దలఁపక-యిట్లుండు కొఱకె?
ఓరి! రామద్రోహి!- యొకతూపుఁ దోడిగి
నీరొమ్ము నాటించి-నేఁడె కూల్చెదను!"[97]

ఓం

# హనుమ ్వ యము

రగడ కావ్యము

## ్ర య శ్వాసవ

### ము॥ కా|ప. నము

కందగర్భహరి గతిరగడ

రామారఘువంశార్ణవసోమా!

రమ్యసుగుణగణ! సురమునినేమా!!

భీమపరాక్రమ!సువ్రత కామా!

ప్రియజనశుభకర! కరుణాధామా!!

కందము

రామా! రఘువంశార్ణవ

సోమా! రమ్యసుగుణ గణ! - సురమునినేమా

భీమపరాక్రమసువ్రత

కామా! ప్రియజనశుభకర-కరుణాధామా!

## గాయత్రీరామాయణము

### మధ్యాళగతిరగడ

రామా! దశరథరామా! కై కజ -
రామా! తాపసరామా! శ్యామా! ।
రామా! రవిసుతరామా! హనుమ -
ద్రామ ! విభీషణరామా! భీమా ! ॥

రామా! సీతారామా! జగదభి -
రామ! యయోధ్యాధామా! రామా!!
రామా! దనుజవిరామా ! తారక -
రామా! గంగారాజారామా!!

### బాలకాండము

ఓం! అని పాడుదు శ్రీరామాయణ -
ముమామహేశ్వరసంవాదంబును!
ప్రేమభరితహృదయమున నిలుపుకొని -
రామునిసుందరశుభరూపంబును!!

తత్పరరతులు సురలు శ్రీనాథుని -
తండ్రి ! శరణని యజపురస్సరు లై!
యుత్పాదితరావణబాధ లింక -
నోర్వలే మంద్రు ముకుళితకరులై||

సదయుఁడు మందస్మితుఁడు నభయహ-
స్తంబు నెత్తి యిట్లను దిగివచ్చెద!
ముదమున దాశరథిగ దైత్యుల నని -
మొనఁ దునిమెద రక్షణ మీ కిచ్చెద!!

విష్ణుమూర్తి రామాఖ్య నయోధ్యను -
వేడుకఁ గౌసల్యకు జన్మించును!
జిష్ణుడు దాటకను బరిమార్చి కౌ -
శికయాగంబును సంరక్షించును!!

తురీయ స్థిరుఁడు రాముఁ డహల్యా -
దోషము వాపును విఱిచి శివుని విలు!
పరిణయమాడును సీతను భార్గవు -
భంగపఱిచి చేరం జనుఁ దన యిలు!!

## అయోధ్యాకాండము

వరదుని పట్టాభిషేకముకు దే -
వతలమహిమచే విఘ్నము గలుగును!
వరములు దండ్రివి సత్యంబులు సలు -
పగ రఘురాముం డుద్యుక్తుఁ డగును!!

రేపకడను సీతాసౌమిత్రులు -
ప్రీతి వెంట రా వనముకుఁ దరలును!
శ్రీపతి సేవించి భరద్వాజునిఁ-
జిత్రకూటవాసుం డయి వఱలును!!

నియమించుచుఁ బాదుక లిడి తనప్రతి-
నిధిగా భరతునిఁ గడు లాలించును!
నియమ యుతుఁడు గైకజుఁ డనుజునితో -
నీతి రామరాజ్యము పాలించును

యమనియమాఢ్యుఁడు వాల్మీకి మహా -
శ్లాఘ్యజ్ఞమేర నత్ర్యాశ్రమ మేగును!
అమలచరితానసూయాశీస్సుల -
నందుకొనుచు దండకమున సాగును!!

## అరణ్యకాండము

భరము మాన్ప భూదేవిది విరాధు -
వధగొని మునిరక్షణ వహియించును!
గరుణతో నిడిన దివ్యాస్త్రంబు ల -
గస్త్యమహాముని వలన గ్రహించును!!

గోదావరి కుత్తర తీరంబునఁ -
గోరి పంచవటి ముని స్థానమున!
బోధించుచు మునులకు సుప్పనాతి-
ముకుచెవులు దఱుగు జనస్థానమున!!

దేవద్విషులను ఖరాద్యసురులను -
దెగటార్చును మారీచునిఁ జంపును!
రావణహృతసీతను నెమకుచు ఖగ -
రాడ్జటాయువును మోక్షము కంపును!!

వనరుహాక్షుఁడు గబంధునిఁ బ్రోచును-
భక్తురాలు శబరిఫలంబులు దిను!
వనితకుఁ బ్రతిఫలముక్తిఫల మొసగి-
పంపాసరస్తటంబు సేరుకొను!!

## కిష్కింధాకాండము

సయవిష్ఠుని రామునిఁ గలయు హనుమ -
సల్పు రామసుగ్రీవుల మైత్రిని!
రయమున వాలినిఁ గూల్చిచేయు హరి-
రాజును మిత్రుని మిత్రునిపుత్రుని!!

ధీమానుఁడు ప్లవగేంద్రుఁడు సీతా -
దేవీమార్గణముకుఁ బంపించును!
సామజబలహరివిక్రములను మా -
సము లోపల రండని శాసించును!!

మహిజాతను దక్షిణదిశలో హను -
మంతాదులు వెదకుచు వేసరుదురు!
అహిరాజన బుస్సు బుస్సు మనెడు మ-
హార్ణవంబు తీరంబు సేరుదురు!!

హితవరి సంపాతి లంక దుఃఖ స -
హిత నిలసుతఁ జూపుచుఁ దా నరుగును!
హిత ప్రేరణలఁ బొంగుచు జనకదు-
హితఁ గన మారుతి సంసిద్ధు డగును!!

## సుందరకాండము

ధిషణుఁడు హరి యుల్లంఘించు నదధి -
ధీరుఁడు లంకను హతమొనరించును!
విషయవిదూరుడు లంకను మైథిలి -
వెదకుచు గనక బహుగఁ జింతించును!!

యోగినిరూప నశోకవనమున - న-
యోనిజ గని పావని హర్షించును!
త్యాగధనునిఁ బ్రియధవు నెడబాసిన-
ధరణిజదైన్యమునకు దుఃఖించును!!

యోధుఁడు సీతకు ముద్రిక నిడి రా -
జోద్యానము బలముల భంజించును!
బాధితుఁ డింద్రారి ప్రయోగించిన -
బ్రహ్మాస్త్రం బాతని బంధించును!!

నరవరుని దూత బోధించు నసుర -
నాథునకు హితవు, లంక దహించును!
సరసిజాక్షి జానకి కుశలంబును -
సరగున రాఘవునకు వినిపించును!!

## యుద్ధకాండము

ప్రసన్నవదనుఁడు వానరులు గొలువ -
వార్ధి దాటి లంకాపురిఁ జేరువ!
అసహాయశూరుఁడా రఘువీరుం -
డాహవమున నిటలాక్షుని మీరును!!

చోద్యపడుచు గన ఋషిమునిగణములు-
చూచుచుండఁ జకితులు దివౌకసులు!
నుద్యతాయుధుల బలరాక్షసుల ర-
ణోన్మాదులఁ గూల్తురు వనౌకసులు!!

మాటలు పల్కు_నది, సుందరమైనదియగు నాభార్య సీత నన్నువిడిచి పరమదుఃఖితయై నీతో ఏమిచెప్పింది - అని శ్రీరాముడు హనుమంతుని అడిగినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై విషయాన్ని సొంపుగా విస్తరించాడు.

"అన్న! వాయుకుమార! - యాపన్ను నన్ను
మన్నించి ప్రాణముల్- మఱలింపు మీవు!
నన్ను నెత్తుకపోయి - నలినాక్షి సీత
యున్న వనంబులో - నునిచి రమ్మిపుడు!
ఏల చెప్పితి "సీతc" - నేc గంటిననుచు?
తేలేవె మూపుపైc? - దేవలెనన్నుc
జూచియు డించి వ-చ్చునె నిన్నువంటి
ధీ చతురుండు నా-తెఱఁగెఱిఁగియును?
ఏమి వల్కెను సీత? - యెటులోర్చె దనుజ
భామలచేతి ని-ర్బంధంబునకును?
నీవేమి యంటివి? - నిమిషమాత్రంబు
నీవలc దాళలే - నెగిరి పోఁజాల
నెట్టులున్నది సీత? - యేమని మాట
పట్టు లిచ్చితి వింకc - బ్రదుకునేనెలయు?
తెలియcబల్కుము వెతc - దీఱి కొన్నాళ్లు
నిలువరించెద' నంచు-నిలువోపలేక"[107]

'రోగి మందు వల్ల జీవించివుండునట్లు నేను సీత చెప్పిన మాటల్ని నీద్వారావిని బ్రతికివుంటా'నని మూలంలోని రాముడు హనుమంతునితో అన్నాడు. వరదరాజు రాముడు హనుమంతునితో, 'వాయుకుమారా! నాప్రాణాల్ని నీవేకాపాడవలెను. కావున నన్నుతీసికొనిపోయి సీత వున్న వనంలో వదిలిర'మ్మని మొదట కోరాడు. తర్వాత' సీత ఏమిచెప్పిందో నీవు నాకు తెలుపుము. దాంతో నా బాధతీరి కొన్నాళ్ళు బ్రతికి వుంటా'నని హనుమంతుణ్ణి అడిగాడు. దీన్నిబట్టి మూలరామునిలో కనిపించు స్థిర చిత్తము వరదరాజు రామునిలో కొరవడినట్లు పైకిగోచరించినా, ప్రియా విరహితుడై ఉన్న శ్రీరాముని పాత్రకు ఆపల్కు_లు మానవ స్వాభావికంగానే ఉన్నాయని సమర్థించ వీలుకలదు.

హరిణగతిరగడ

రాము రామ యనంబడెడు స -
ల్లాప మెచ్చుటి నుండి వచ్చెను!
నా మదినిఁ గొనసాగు జపస -
న్నాద మది యే చెవినిఁ జొచ్చెను!!

రాక్షసీమాయారహితములు -
రామభక్తుని వాక్కు లగు నెడ!
నీ క్షణ మె నా కై యతడు ప్ర -
త్యక్ష మయ్యెడు గాత నీ యెడ!

సీత మొసగిన యాజ్ఞ గొని కపి -
శేఖరుడు మురిసె నా పట్టున!
మాతతో భాషించుటకు నస-
మానప్రజ్ఞుడు దోచెఁ జెట్టున!!

సకలశాస్త్రవిశారదుఁడు నస -
చ్చరితుఁ డనఘుఁడు దురితదూరుఁడు!
ముకుళి తాంజళిపుటుఁడు జానకి-
ముందు నిలిచెను కపికిశోరుఁడు!!

మర్కటాకృతి వచ్చె దుష్టుఁడు -
మఱల నని భయభీత యయ్యెను!
గర్కశాత్ముఁడు రావణుం డని -
కలికి తూష్ణీంభూత యయ్యెను!!

మిన్న కుండిన సీతఁ గని విన -
మితశిరస్కుం డనెను సీతా!
సన్నుతుఁడు శ్రీరామునకు నతి -
సన్నిహితుఁడను నేను మాతా!!

ఆంజనేయుడ వానరాధిపు -
డర్కసుతుని ప్రధాని నే నరి!
భంజనుని రాముని భటుడ నని -
వందనము సేసి నిలఁబడు తరి!!

తేరుకొని సంశయము మిగులగఁ -
దెల్పు వానరులకు నరుల కును!
జేరు వెటు లయ్యె నన వారల -
స్నేహమును హనుమ యిటు వలుకును!!

మరాళగతిరగడ

రామలక్ష్మణుల దశరథ తనయులఁ -
బ్రాంశుజటావల్కాంబరధారుల!
ప్రేమవీక్షణుల ధనుర్ధారులను -
ప్రియదర్శనులను నగసమధీరుల!!

వీరుల గొని సుగ్రీవునిఁ గూర్చితి -
వెలసె ననలుసాక్షిగ మిత్రత్వము!
దారారాజ్యాపహరుఁడు వాలికిఁ -
దనకు నడుమ గలిగిన శత్రుత్వము!!

శ్రీరామున కెఱిగించె రవిసుతుఁడు-
సీతాభూషణములు సూపించెను!
రారమణిని వెదుక వచన, మిచ్చెను-
రఘుపతి మిక్కిలి సంతోషించెను!!

తారానాథుని వధగొని కిష్కిం -
ధారాజ్యము భానుజునకు నిచ్చెను!
వీరులఁ గపులను దశదిశలకు నం-
పించె హరీశుఁడు హరి నను మెచ్చెను!!

జానకివిశ్వాసార్థము ముద్దుల-
జయకరముద్రిక నా కందించెను!
"వానరవర"! యిక్కార్యం బందు స-
ఫలుడవు గొమ్మని నను దీవించెను!!

వారాశిని లంఘించితి లంకను-
వధగొంటిని లంకను నేఁ జొచ్చితిఁ!
గ్రూరదనుజులకుఁ గంటఁ బడక మీ-
కొఱకై రాముని కుశలము దెచ్చితి !!

అన మారుతితో సీవనిజ యిట్లనె-
నంత జలధి నీ వింత మాత్రుడవ!
అనఘా! దాటితి వన నాశ్చర్యం -
బైన రామ సత్కృపకుఁ బాత్రుడవు!!

బలవంతు డనిలసుతుఁడు సీతకై
పర్వతసన్నిభదేహము దాల్చెను!
గలికి సీత గని కడుఁ దృప్తిపడగఁ
గపివరుడు యథాపూర్వము నిల్చెను!!

పలికెను దల్లీ! మీపదదాసున-
కిల మీ దయ గల దింకను జింతయ!
బలముల కెల్లను బల మైన మహా-
బలుని భక్తునకు బలము కొఱంతయ !!

## రామాంగుళీయ మొసంగుట

### హరిణగతిరగడ

"అమ్మరో! నే మీ కనన్యుడ-
నమ్ము నను, మీ భృత్యుఁడని" యని!
సమ్మతిగ రామాంగుళీయ మొ-
సంగ నంగన దానిఁ గొని కని!!

"నా వివాహ సుసమయమున జన-
నాథునకు నా జనకు డొసగెను!
భావనపు టుంగరమ! నిను గని -
భావమున సంశయము దొలగెను"!!

అనుచుఁ బులకితగాత్ర, పూరిత
హర్షజలనేత్ర యుంగరమును!
మనము ద్వరపడ శిరముఁ దాల్చును
మమత ముద్దులు గురుపుఁ గరమును!!

నందమున నద్దును గనుల, నెద -
యందుఁ జేర్చును గౌగిలించును!
సుందరాంగుని బాహుబంధము-
నందు గల సుఖ మనుభవించును!!

కువలమేశుని రాక గాంచిన-
కువలయము లన గనులు విరిసెను!
బ్రవిమలము రాజముఖిముఖ మది-
రాహుముక్తశశి వలె మెఱసెను!!

అశ్రుజల కణముత్యముల గమ-
లాక్షి దన నేత్రాబ్జములతో!
మిశ్రమించి యొనర్చి పూజలు
మెల్లగా నసె నుంగరము తో!!

"లోకనాథుఁడు నినకులాబ్ధి సు-
ధాకరుఁడు శ్రీరామచంద్రుడు!
రాకపాయెను, నేటి వరకు ని-
రాకరించెన? రాఘవేంద్రుడు!!

నీకు మాత్రము మమత నా పై-
నిండుగా గల దో కృపానిధి!
నా కొఱకు వెదకుచును వచ్చితి-
నన్ను గాంచితి ప్రేమవారిధి"!!

విజ్ఞురా లగు సీత యంత కృ-
తజ్ఞతా భావంబు చిలుకగ!

ప్రాజ్ఞుఁడగు ప్లగేంద్రు మొగమై-
బాష్పములు నేత్రముల నొలుకగ!!

"వారధివి రాములకు నాకును -
వానరేశా మనసు గోరదు!
నీరజాక్షునిఁ దప్ప యితరము-
నీ ఋణం బెన్నటికిఁ దీరదు!!

కుశలమే? రామలక్ష్మణులకు,-
కుశలమే? కపికులపు నేతకు,!
కుశలమే? నీకును, గపులకును-
గుశలమే?" యని యడుగు సీతకు!!

పల్లవమృదుల పదములకుఁ బ్రణ-
మిల్లి మైథిలికి నెనర్లిల్లికి!
బల్లిదుఁడు గపితల్లజుం డిటు
వల్కెఁ దల్లికిఁ గల్పవల్లికి!!

"రామలక్ష్మణులకును క్షేమము,-
రవిసుతాదికపులకు క్షేమము,!
స్వామి నీ క్షేమమ్ముగూరిచి-
పరితపించును నిర్విరామము!!

జానకీ! జానకీ! యనుచును-
జరుపు నామామృతపు పానము!
మానవేంద్రుఁడు నీ విషయమున-
బూనినా డనిమిషవిధానము!!

ప్రవాళరగడ
సావధానులై వానరలు
సైన్యాధిపతులు గొలివగ!
పావనుండు సుగ్రీవుఁడు-
స్వామిసన్నిధిని నిలువగ!!

**2.5.4 కల్పనలు**

1) హనుమంతుడు సముద్రముపై ఆకాశమార్గంలో పయనిస్తూవుండగా మైనాకుడనే పర్వతం ఆసముద్రంనుంచి పైకివచ్చి ఆతని మార్గానికి అడ్డుపడింది. అప్పుడు మైనాకుడు హనుమంతునితో క్రింది విధంగా తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

"శ్లో|| సమాముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్,
తతోऽహం సహసా క్షిప్తశ్వ్వ ససేన మహాత్మనా||
అస్మిన్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ|,
గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాऽభిరక్షితః||.
తతోऽహం యానయామి త్వాం మాన్యోహి మమమార్గతః
త్వయామే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః||
అస్మిన్నేవం గతే కార్యే సాగరస్య మమైవ చ |,
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వమర్హసి మహాకపే||"[116]

'దేవేంద్రుడు కోపంతో వజ్రాయుధంఎత్తుకొని నారెక్కల్నిరికి వేయడానికి వచ్చాడు. అప్పుడు మహాత్ముడైన వాయుదేవుడు శీఘ్రంగా నన్నుదూరంగా నెట్టుకొని పోయాడు. నీతండ్రియైన వాయుదేవుడు నన్నుసముద్రంలో పడద్రోసి నారెక్కలు తెగిపోకుండా కాపాడాడు. అందువల్ల వాయుదేవుడు నాకు పూజనీయుడు. అతణ్ణి పూజించిన వాడునగుటకై అతని పుత్రుడవైన నిన్ను పూజిస్తాను. నీ తండ్రి నన్ను రక్షించాడు. కాబట్టి ఆతని పుత్రుడవైన నీతో నాకు సంబంధంవుంది. కావుననేను, సముద్రుడు ఇచ్చే ఆతిథ్యాన్ని నీవుసంతోషంతో స్వీకరించవలెను - అని మైనాకుడు హనుమంతునితో అన్నట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు ఇక్కడ మూలంలోని మూడు శ్లోకాలభావాన్ని పూర్తిగా పరిహరించి క్రిందివిధంగా తెనిగించాడు.

"ఓయి! వానరవీర! - యుదధి నాయకుఁడు
నీయత్న మెఱిఁగి మ-న్నించి నాచేత
బహుమాన మొనరింపఁ -బనిచె నిచ్చోట
విహరింపు మాఁకటి-వేళకు వలయు
ఫలములు సేవింపు-బడలిక దీఱ
వలయు తావునకుఁ బో-వఁగ సమ్మతింపు"[117]

అనుచు దీవన లిచ్చు సీతా-
జననిపాదంబులకు మ్రొక్కుచు!
విసయ మంతయు నట్టిపడగా-
విన్నవించె ముదమునఁ జొక్కుచు!!

## చూడామణి పరిగ్రహణము

### విజయభద్రరగడ

"భూమిజా! మీ యాజ్ఞఁ - బోయినచ్చెద నిమ్మ-
భూమీశునకుఁ జూప - నేమేనియు నభిజ్ఞ"
ఆమె దన కేశముల యం దమరి యున్న చూ-
డామణిని గొని యిచ్చె లలనామణి విధిజ్ఞ!!

"స్వామికిని నాకుఁ గే - వలము గుర్తు గలట్టి-
సత్యమైనది రహ - స్యంబు విను మొకనాడు!
రాముండు నా యంక - సీమ నిద్రించ దు-
ర్మదుఁడు గాకాసురుం - డదను గైకొనినాడు!!

క్రూరుండు మత్పదాం - గుష్ఠంబు గని భ్రాంతిఁ
జీర దర్భాస్త్రముఁ - శ్రీహరి ప్రయోగించెఁ!
బారెను, నరక్షితుఁడు - వచ్చి శరణము వేడ-
ప్రభువరుం డొక్క నే - త్రము గొనుచు రక్షించె!!"

అని పలికి పోయి ర - మ్మనుచుఁ బ్రేమలఁ జూచి-
యవనిసుత దీవించి - యతగాని నంపించెఁ!
దన రాఘవుల బలో - ద్ధతిఁ బ్రదర్శించుటకు-
హనుమ యోచించి యా - యమ నిట్టు లర్థించె!!

### ప్రవాళరగడ

"ఆకొంటి యొసంగుమ యే-
మైనను నా కో పెన్నిధి!
చేకొని కడుపారగఁ దిని-
చేరెద రాముని సన్నిధి!!"

**2.6.1. మూలవిస్తరణ (యుద్ధకాండము)**

1) హనుమంతుడు లంకలో కావించిన విధ్వంసాన్ని గూర్చి రావణుడు రాక్షసులతో ప్రస్తావించడం మూలంలో మూడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| లఙ్కాయాంతు కృతం కర్మ ఘోరం దృష్ట్వా భయావహమ్|,
రాక్షసేన్ద్రో హనుమతా శక్రేణేవ మహాత్మనా||
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్హ్రియా కించిదవాఙ్ముఖః|,
ధర్షితా చ ప్రవిష్టా చ లఙ్కా దుష్ప్రసహా పురీ||.
తేన వానరమాత్రేణ దృష్టా సీతా చ జానకీ|
ప్రాసాదో ధర్షితశ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః||"[120]

లంకలో హనుమంతుడు చేసిన మహాభయంకర కార్యాన్ని చూచి రావణుడు సిగ్గుచేత ఇంచుకతలవంచుకొని రాక్షసులతో ఇలాచెప్పాడు. 'శత్రువులకు ప్రవేశింపసాధ్యంకాని లంకాపట్టణంలో హనుమంతుడు నిర్లక్ష్యంగా ప్రవేశించి జనకుని కుమార్తెయైన సీతను చూచిపోయాడు. ఆతడు చైత్యప్రాసాదాన్ని పగులగొట్టి ఉత్తములైన చాలమంది రాక్షసుల్ని చంపాడు. అతడు లంకా పట్టణాన్నంతా దహించి వ్యాకులంగావించాడు' - అని రావణుడు వారికి తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

మూలంలోని పైభావాన్ని వరదరాజు ఈక్రింది విధంగా పెంచాడు.

"అపుడు లంకాపురి-నా దశాననుఁడు
కుపితాత్ముఁడై తన-కొలువులో నున్న
యతిశౌర్య నిధులఁ బ్ర-హస్తాదులైన
హితమంత్రులను జూచి-యిట్లని పలికె
'హనుమంతుఁ డొక్కఁడే-యంబుధి దాఁటి
యనిమిషేంద్రుఁడు చూడ-నలవి కానట్టి
తనదు లంకారాజ-ధానిలోఁ జొచ్చి
జనకజతోడ ము-చ్చట మాటలాడి
యూరకే చనక నా-యుద్యాన కనక
భూరుహావళి సర్వ-మును నేలఁగూల్చి
వలదని వారింప-వనపాలకులను
బొలియించి ప్రాసాద-ము దుమారుచేసి

మంత్రి సూనులఁ బట్టి-మహిఁ బడఁగొట్టి
మంత్రుల నేవురి-మర్దించి మించి
యక్షకుమారకు-నాలంబులోన
శిక్షించి దానవ-శ్రేణి నడంచి
తోఁకఁ గాలిచి వెళ్లఁ-ద్రోలుఁడటన్న
కాఁకమై కొనకలం-కాపురం బెల్లఁ
గాలిచిపోయె రా-ఘవు దూతననియు
నేలిక సుగ్రీవుఁ-డిటు పంపెననియుఁ
జేరి చిల్వివషమును-జేయుచుఁ గోఁతి
యూరెల్ల గాలిచి-యూరకే చనియె"[121]

హనుమంతుడు లంకలో చేసిన విధ్వంసంపట్ల రావణుడు సిగ్గుతో ఇంచుక తలవంచి ఆవిషయమై రాక్షసులతో ప్రస్తావించినట్లు మూలకర్త వ్రాశాడు. హనుమంతుడు లంకలో కావించిన భయంకరకార్యాన్ని గూర్చి తెలియగానే వరదరాజు రావణుడు కుపితాత్ముడైనాడు. దీనిని బట్టి మూలంలోని రావణుని కంటె వరదరాజు రావణుడు శౌర్యపరాక్రమాలు కలవాడని చెప్పవచ్చు. హనుమంతుడు, ఏడుగురు మంత్రులను, తదితర దానవశ్రేణిని సంహరించాడని, లంకనుంచి హనుమంతుణ్ణి పారద్రోలడానికి రాక్షసులు ఆతనితోకకు ఆగ్గిపెట్టగా లంకంతాకాల్చి పోయాడని వరదరాజు రావణుడు రాక్షసులకు తెలిపాడు. లంకాపట్టణాన్ని హనుమంతుడు దహించివేసినట్లుమూలం. దహించుటకుగల హేతువును వరదరాజు విశదీకరించినాడు. రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పంటించుట అనే విషయం తెలుగలో చోటుచేసికొన్నది. ఈ వివరణ కావ్యానికి కొంత మెరుగును కల్పించింది.

2) ఇంద్రజిత్తు అంతర్ధానుడై రామలక్ష్మణులమీద బాణాల్ని ప్రయోగించాడు. దానితో వారిదేహాలనుంచి నెత్తురు స్రవించింది. అప్పుడు ఇంద్రజిత్తు రామ లక్ష్మణులకు తనశౌర్యపరాక్రమాల్ని గూర్చి తెలుపడాన్ని మూలకర్త ఒకశ్లోకంలో వ్రాశాడు.

"శ్లో|| యుధ్యమాన మనాలక్ష్యం శక్రోఽపి త్రిదశేశ్వరః|
ద్రష్టుమాసాదితుంవాపి న శక్త కింపునర్యువామ్"||[122]

'నేను అంతర్థానమై యుద్ధం చేస్తుండగా దేవనాథుడైన ఇంద్రుడుకూడా నన్నుచూడడానికిగాని, సమీపించడానికిగాని సాహసించలేదు. ఇంక మీారు

# హనుమద్విజయము

వనభంగపు దు+ర్వార్తను విని యా-
వనరక్షకు లటు వచ్చిరి రెచ్చిరి.!
హనుమంతుని వా రార్చుచుఁ గ్రమ్మిరి
పెను నాయుధములఁ బెనగగఁ జొచ్చిరి.!!

కరముల మొత్తుచుఁ, గాళ్లను దన్నుచు,-
గొఱుకుచుఁ బండ్లను, గోళ్లను జీల్చుచుఁ, !
జరచరఁ దోకను జప్పున నెత్తుచు,-
గిరగిరఁ ద్రిప్పుచుఁ, గ్రిందను జర్చుచుఁ,.!!

బ్రక్కలఁ గ్రుమ్ముచు, గ్రక్కగ రక్తం-
బెక్కడి వారల నక్కడ ద్రొక్కుచుఁ, !
జిక్కిన వారలఁ జిక్కిన యట్టుల-
జక్కగ హననము సల్పెను నిక్కుచు.!!

బిరబిర మిగిలిన భీరుకు లురికిరి,-
గొరపదములు గొని కరములు మోడ్చిరి,!
శరణము వేడుచుఁ గరుణను గోరుచు-
శిరములు వాంచియ చెప్పం దొడగిరి.!!

"భూమీసుతతో సంభాషించెను-
బుద్ధికుశలుఁ డొక మర్కటవీరుఁడు!
స్వామీ! మన వనమును రక్షకులను-
భంగమొనర్చె మహారణశూరుఁడు.!!

నందనవనమును గేరు నశోక వ-
నంబును శోకవనముగా మార్చెను!
బంధనములు గూలిచి సురసుదతుల-
బంధనములు దొలగంగ నొనర్చెను!!

'ధర్మవేత్తవైన విభీషణుడా! నీవు లంకా రాజ్యాన్ని పొందగలవు. ఇందులో సందేహంలేదు. రావణుడు, ఆతని కుమారుడు యుద్ధంలో విజయాన్ని పొందలేరు. రామలక్ష్మణులు మూర్ఛనుండి తేరుకొని యుద్ధంలో రాక్షస సమేతంగా రావణుణ్ణి వధిస్తారు' - అని సుగ్రీవుడు విభీషణునకు చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని ఇలా పెంచి రచించాడు.

"ఇంతయేఁటికి నీకు-నేమిటఁ గొఱత?
చింతిల్ల మనకేల-శ్రీరాముఁ జూచి
జానకీ రమణుఁడు-సహియించెఁగాక
ఈ నాగపాశంబు-లివియేమి సేయు?
ఇదె నేఁడేఁతెఱు-నినుఁ డుదయింపఁ
గదనంబులో దశ-కంధరుఁ దునిమి
యీ లంక నీకిచ్చి-యిల పత్నిఁగూడి
యేల నున్నాఁడు మ-హీచక్రమెల్ల
మనవంటి వారల-మనసులఁ జూడఁ
గనుమూసి యున్నాఁడు-గాక రాఘవుఁడు!
దొడిఁగిన యొకకోలఁ-దునుమఁడే యలిగి
గడియలో మూఁడులో-కములు చూర్ణముగ
రాఘవామోఘ నా-రాచ ధారలకు
మేఘంబు లడ్డమే-మేఘముల్ మఱుఁగు
చేసి నిల్చిన యింద్ర-జిత్తునిఁ దునుమఁ
గోసలేంద్రునకు నె-క్కుడు ప్రయోజనమె?
ఏమి చింతించెనో-యిటులున్నవాఁడు
రాముఁ డీమీఁద స-ర్వము నెఱింగెదవు."[125]

సుగ్రీవుడు విభీషణునితో 'మనమనస్తత్వాన్ని తెలిసికొనడానికి రాముడు కన్నుమూసియున్నాడు. ఆయన నిజంగా మూర్ఛపోలే'దని తెలిపాడు. 'రాఘవుడు ఒకఘడియలో మూడులోకాల్ని చూర్ణంచేయగలడు. మేఘాల చాటునవుండే ఇంద్రజిత్తును చంపడానికి రామునికి మేఘాలు అడ్డంకావు' - అని సుగ్రీవుడు రాముని శౌర్యపరాక్రమాల్నిగూర్చి విభీషణునికి తెలిపినట్లు వరదరాజు వ్రాశాడు.

రామలక్ష్మణులు మూర్ఛనుంచి తేరుకొని యుద్ధంలో రాక్షససమేతంగా ప్రతినాయకుడైన రావణుని సంహరించగలరని మూలకర్త తెలిపాడు. అయితే వరదరాజు తన అనువాదంలో రాముని పరాక్రమాన్ని విశదపరుస్తూ ఇంద్రజిత్తును

## రాక్షససంహారము

### మహా విజయభద్రరగడ

అంజనాద్రిశరీరు - లాయుధములు ధరించి-
యట్టహాసముల తో - నార్భాటములు గలువ-
భంజింపు డీకోతిఁ - బట్టు డని యార్చుచుఁ బ్ర-
భంజనుని సుతిని పైఁ - బడిరి మూకుమ్మడిగ.!
సంజీవరాయండు - స్తంభ భ్రమణములను-
సర్వగతుఁడగుచు సం - చారంబు గావించె
రంజన చెడి మడసె - రాక్షసశలభగణము-
ఆంజనేయుని ప్రతా - పాగ్నిఁ బడి వడివడిగ.!!

### మహా ప్రవాళరగడ

దశముఖు నానతిఁ బ్రహస్తు-
తనయుఁడు హనుమ పయి గురిసె-
ధరణీధరము పయి వర్ష-
ధారలోయన బాణంబులు.-
లిశనిపాతహతభూరుహ-
మనగ హరి స్తంభాయుధ-
హతుఁడు జంబుమాలి కూలి-
త్యజియించెను బ్రాణంబులు.!!

### విజయ భద్రరగడ

బింకబుతో విఱ్ఱి - వీగు చేద్వురు మహా-
వీరులును మంత్రుల కు - మారు లతిహర్షమున!
జంకుగొంకు లనక య - చలు మర్కటాచలుని-
జడివాన వలె ముంచ - శస్త్రాస్త్రవర్షమున,!!
"నింకఁ జెల్లెను మాక - లీ భువినిఁ బరలోక-
మేగుండి" యనుచు నెదు - రించు రాక్షసగణముఁ!
గంక పాదలను గాల్చు - కార్చి చనగ హనుమ
గ్రమ్ముకొని సర్వమును - గబళించెఁ దత్క్షణము.!!

మహామరాళగతిరగడ
దండధరసమోద్దండులు నేవురు-
దండనాథు లా దుండగు డేదని-
మండుచు మండెడు నస్త్రశస్త్రములఁ-
జండునిఁ గపిమార్తాండునిఁ గుప్పుగ!
ఖండపరశుపురఖండన మన నా-
ఖండలు కొండలఁ బిండిగొట్టుటన-
భండనవీరుని దండి దగు గదా-
దండమున దనుజఖండన మొప్పగ,!!

హరిగతిరగడ
లోహస్తంభాయుధుఁడు విభీషణ-
లోహితనేత్రుఁడు శైలాకారుఁడు!
ఆ హనుమానుఁడు దన లాంగూలము-
నాడించుచు నిల్చెను గంభీరుఁడు.!!

అక్షకుమారవధ
కోతినిఁ బట్టుకొ వచ్చెద నే నని-
కోరి జనకు నా జ్ఞలు గొని వచ్చెను!
ఖ్యాతుం డక్షుఁడు మృత్యుముఖపు సు-
గ్రాసము యన హనుమ నెదురఁజొచ్చెను!!

బాలుని గని దయలూరగ మారుతి-
జాలిని గొని "యర్భక! విన వేరా!
గోళీ లాడుట గాదుర నాతోఁ-
జాలవు పోరను నింటికిఁ బోరా.!!

మరాళగతిరగడ
మొక్కవోని శూరుడ నే నెక్కడ?-
ముక్కుపచ్చ లారని నీవెక్కడ?!
ముక్కవ వాడమును బాలుగారు నీ-
చెక్కిళులం గన, నుండకు మిక్కడ.!!

కయ్యమునకు వయ్యమునకు నారయఁ-
గావలయును సమత నిలను బాలుడ!!
చయ్యన మఱలుమ బ్రతుక గలాడవు-
సంగరరంగంబున రిపు కాలుడ.!!"

అన విని యక్షకుమారుం "డోరీ!-
వనచర! నాపురుషార్థము గనరా!"
అనుచును శరవర్షంబును గురియగ-
హనుమ యచలుఁ డిట్లనియెను. "వినరా!!

మధురగతిరగడ

బాలసుయోధా - బలమును మెచ్చితి,!
వాలాయముగన - భయ మిదె యిచ్చితి,!!
చాలుర యని",యన - గాల ప్రేరిత!
బాలుఁడు విసరెను - శూల మవారిత.!!

మరాళగతిరగడ

"పాప మన వలదు పాపఁడేని పసి-
పాప నేని యది పాలను గ్రక్కున?!
వ్యాపింపక ముందే చిచ్చును జ-
ల్లార్ప వలయు నిశ్శేషము గ్రక్కున!!"

ఊహించి యిటుల సమదర్శనుఁడు, ని-
రీహుఁడు, నిస్సంకల్పుఁడును, స్థిరుఁడు!
ఆహవమున కాహ్వానం బది యని-
యా హనుమానుఁడు కీశకుంజరుఁడు,!!

రథము నుగ్గుగా చొనరించెను సా-
రథినిఁ గూల్చి రథ్యంబుల ద్రుంచెను.!
గద గొని తారాపథమున కేగెడు-
వ్యధితుని పదములు పట్టి గ్రహించెను.!!

నేర్పున వానిని గిరగిరఁ ద్రిప్పుచు-
నేలకు నుతికెను హరిహర్యక్షుఁడు,!
సర్పంబును గొని విసరి భూమి పైఁ-
జఱచి కొట్టెనో యనగాఁ దారుక్ష్యుడు.!!

**హరిగతిరగడ**

అతులపరాక్రమశాలి హనుమ సిం-
హపు గర్జ యొనర్చెను రా రండని.!
హతశేషులు వారిరి తమ దొరకై-
శ్రుతపఱచిరి జరుగనిది జరిగెనని.!!

**దశశిరుని పరితాపము**

తనయుని నిధనము విని దశకంఠుఁడు-
ఘనశోకహాత్యుఁడు క్రోధవివశుఁడె!
తన జ్యేష్ఠసుతున కింద్రారి కనియెఁ-
దత్క్షణమునఁ గర్తవ్యోన్ముఖుఁడై.!!

"హతమార్చె చతుర్థాంశ బలమ్మును,-
హరి కడతేర్చెను నగసమధీరుని,!
నతిసుకుమారుని, మారాకారుని-
నక్షకుమారుని, నాహవశూరుని.!!

చూచితి నే బలశాలిని వాలిని,-
సుగ్రీవుని, జాంబవు నతివీరుని,!
చూచితి నే డందఱలను మించిన-
శూరాగ్రసరు, సమీర కుమారుని.!!

అతి బలవంతుని, హనుమంతుని, నా-
హవమున గెల్చు బలఢ్యుఁ డెవడు? గన!
సుతఘాతకుఁ గపిక్షుద్రునిఁ బంపెద-
సూటిగ యమపురి చూడుము నే" నన,!!

మరాళగతిరగడ

"ఆర్యా! సురగంధర్వ గరుడులును-
యక్షనాగకిన్నరకింపురుషులు!
మర్యాదలు దప్పక మిము గొలుతురు-
మర్కటుఁ దాకుటయ! మహా పురుషులు!!

తల్లడిలుచు సురగణము వార ముని-
తల్లజులుం దడబడ మీదు సుతుఁడు!
ముల్లోకాధిపుఁ బట్టితెచ్చి మీ-
ముందర నిలబెట్టిన యింద్ర జితుఁడు!!

హరిగతిరగడ

బల్లిదు డుండగ భయ మేల? యసుర-
వల్లభ! పనుపుడి బహు శస్త్రాస్త్రుడ!
ప్రల్లదు వనచరుఁ బడవేయుదు మీ-
పాదకమలముల పై బ్రహ్మాస్త్రుడ.!!"

మరాళగతిరగడ

అన "హనుమాం డ్లనిమొనమొనగా డౌఁ-
దన లావు నెదిరి లావు గనుము ఘన!
"ఘననిస్వన! స్వామి కార్యమునఁ గడుఁ-
గడు మెలకువై సఫలుడ వై రమ్మన!!"

హరిగతిరగడ

తనయుఁడు మ్రొక్కిన హర్షపులకితుఁడు-
దనుజవిభుం డాతనిఁ గడు మెచ్చెను!
" వనచరు సాధింపుము విజయీ భవ!
యని దీవించుచు ననుమతినిచ్చెను.!!

## ఏడేండ్ల వర్షపు శని

విజయభద్రరగడ

"నేడు మారుతి నింక - నేను సాధింతు"నని-
నిశ్చయించుకొని శని - నేరుపన వినతుఁడై!
జోడించి హస్తములు - చూడ్కులు పదము లంట-
జోహార్లు వలికి ని - ల్చుకొనెఁ గడు భీతుఁడై!!

స్వామి! స్వామీ! యనుచు - సారెసారెకు వచ్చు
శనిపీడ విరుగు నని - చతురుండు మోదించె!
'స్వామికార్యమును దన - పనియు సిద్ధించు'నని
స్వాగతం బిడి శనై - శ్చరుని నామోదించె!!

ఎంతకాలపు నేస్త - మిదన మారుతి, పంగు-
చేడేండ్ల మన - యేడ్చానని హరి యనె!
గొంత తగ్గింతు నీ - కొటకేడు నెలలవర-
కొసరకుడి యన సౌరి, - కుదుర దని కీశుఁడనె!!

సంతంబుగా దేడు - వారాలనరయైన-
వర్షనక కొను డన్న - వానరుఁడు గా దనెను!
మంతనంబున గినుక - మాని యేడున్నర ప్ర-
మాణ వాసరములన - మారుతి 'యుహూ' మనెను!!

ఇంతకంటెను దక్కు - వింకఁ గాబోదు దయ-
సేడు గడియలు నర - యేలు డని మందుఁడనె!
వింతగాఁ జూచి కపి - విస్మితుఁడు సరె యనిన-
నేసె శని గంతు న - ప్పీరుని పదములు గొనె!!

## కపినాథమేఘనాదుల యుద్ధము

హరిగతిరగడ

పిత్రాజ్ఞల నరిభీకరవీరుఁడు,-
వివిధాయుధయుక్తుఁడు, వినాయార్థుఁడు,!

ఛత్రపతాకసమేతరథస్థుఁడు,-
చతురంగబలసహితుఁడు, సమర్థుఁడు.!!

మేఘనినాదుఁడెలమి గురియించె స-
మీరసుతుని పై శరవర్షంబు, న!
మోఘగదాఛత్రంబున నిల్పెను-
రాఘవదూత బలోత్కర్షంబున.!!

**మహామరాళగతిరగడ**

మారుతిరాయు డవక్రవిముఁడు-
మార్తాండుని వలె భగభగ మండుచు-
ఘోరదర్శనుఁడు ఘూర్ణిల్లుచుఁ బెను-
కొండ నొకటి దానవుపె వేసెను!

ఆరావణి యాగ్రహపరవశుఁడై-
హరినాదము సల్పుచు నుగ్రుండై-
నారాచసహస్రంబులు గుప్పుచు-
నఘమనె వానినిఁ బిండిగఁ జేసెను,!!

**మరాళగతిరగడ**

కింశుకానేకముల నొప్పించెను-
గీర్తికాము డింద్రజితుఁడు ధీరుఁడు.!
కింశుకవృక్షము పుష్పించెనో యన-
కీశవరుఁడు సొంపలరి గభీరుఁడు!!

**హరిగతిరగడ**

క్రుద్ధుఁడు రథరథసారధిహయకా-
ర్ముకములఁ ద్రుంచె మహావృక్షంబునఁ!
దద్దయు వీనిని హతమార్తు ననుచు-
దైత్యునిపై నురికెను రౌద్రంబున.!!

పై కల్పన వరదరాజు కాలంనాటి రాజనీతి చాతుర్యానికి, మిత్రభేద నైపుణ్యానికి అద్దం పట్టుతూవుంది.

2) యుద్ధంలో మకరాక్షుడనే రాక్షసుడు మృతిచెందాడని తెలియగానే రావణుడు కుపితుడైనాడు. రామలక్ష్మణుల్ని వధించమని ఆతడు తన కుమారుడైన ఇంద్రజిత్తునకు ఆజ్ఞాపించాడు. అప్పుడు రావణుడు ఇంద్రజిత్తు బలపరాక్రమాల్ని పొగడిన విషయం మూలంలో రెండుశ్లోకాల్లోవుంది.

"శ్లో|| జహి వీర! మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,|
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః||
త్వ మప్రతిమకర్మాణ మిన్ద్రం జయసి సంయుగే,|
కిం పున ర్మానుషౌ దృష్ట్వా న వధిష్యసి సంయుగే||"[138]

రావణుడు ఇంద్రజిత్తుతో 'వీరుడా! మహాపరాక్రమశాలురు, అన్నదమ్ములు అయిన రామలక్ష్మణుల్ని నీవువధించుము. నీవు మాయచే అదృశ్యుడవై యుద్ధం చేసినా లేక దృశ్యుడవై యుద్ధం చేసినా బలంలో వారి కన్నావు అధికుడవు. నీవు ఇంద్రు నంతటివాణ్ణి యుద్ధంలో జయించావు. ఇకమనుష్యులైన రామలక్ష్మణుల్ని జయించడం నీకు ఒకలెక్కా? వారిని తప్పకుండా వధిస్తావు' - అని ప్రశంసించాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని స్వతంత్రకల్పనతో మార్పుచేశాడు.

"నాకు హితంబుగా - నమ్మించి పోయి
నందఱుఁ జంపితి-నని వచ్చి యిచట
మందలించెద వఖి-మానంబు మాని
పోయిన వారెల్లఁ-బొలియుటే కాని
నీయట్లు బొంకువా-ని నెఱుంగ నొకని
చావఁ బ్రాల్మాలి యి-చ్చట నిల్లు మఱిగి
యీవు వచ్చు పెటంగ-యెఱుఁగంగలేక
మదమునను నిన్నుఁ బం-పంగ నెగ్గు సిగ్గు
తెలియఁగక నీమొగ-మేను జూచెదను
యీమాట తలసిన - నేఁగ మున్నట్లు
రాము గెల్చితినని-నమ్ము నీకేమి
చేకన్న కార్యంబు-సేయు మనవడు
మీకొంత దిక్కు లే-మని తంద్రనగుట."[illegible]

బ్రాహ్మణులు సేకొనుచు సంధ్యా-
పరికరములను బయలుదేరిరి!
బ్రహ్మకర్మలు దీర్చుకొనుటకుఁ-
వాహినుత తీరములఁ జేరిరి!!

ప్రియుల బిగికౌగిళ్లలోఁ గల-
ప్రేమసుఖముల నలసి సొలసిరి!
ప్రేయసులు భర్తలను శయ్యల-
వీడి గృహకృత్యముల మునిగిరి!!

జారిణులు సిగపూలు రాలగ-
జారు కొప్పులు ముడుచుకొనుచును!
జారు పరిటెలు దిద్దుకొని యిలు-
చేరుదురు దెలవారె ననుచును!!

వృషభగతిరగడ
ప్రక్క వీడెడు భామినిం గని-
యెక్కడకు నేగెద వనుచుఁ బతి-
సిక్క బట్టుచు మక్కువను దన-
బక్కపెట్టునఁ దప్పుకొనుచు న-
హో! యికను ననుఁ బట్టు మనుచును-
బక్కు పక్కున నగుచు సతి యెక-
సక్కెమాడుచుఁ బోవుచుండెను!!
హరిణగతిరగడ
గంట లవి మ్రోయఁ దొడగగ జా-
గంటలును మొరయ గను పూజకు!
జంటజంటలుగాఁ బురజనులు-
సనుచునుండిరి దేవళములకు!!

ఓర చూపుల భర్తలను నొ-
య్యారులును గవ్వించు చుండగ!
సారసాక్షులఁ బతులు దమ సర-
సాలతో నవ్వించు చుండగఁ!!

జారుదరహాసినుల నవ్వులు-
చంద్రికలొ యన గ్రాలుచుండగ!
జారుసిగముడులు ముడిచిన విర-
జాజిపువ్వులు రాలుచుండగఁ!!

గామనుల పాటలకు లయగాఁ-
గంకణంబులు మ్రోయు చుండగ!
భామినులు ఝుంఝుమని పితికిరి-
పాలు దమ భాండములు నిండగ!!

పాలకావడుల గొని పతులును
బట్టణపు వీధులను వెడలిరి!
పాల్గకై క్రేపుల వదలి యా-
పడుచులును దమ పనికి గదలిరి!!

హయప్రచారరగడ

నారదనుత - నళిననేత్ర!
సూరి జనుల - స్తుతికి పాత్ర!!
చారువదన - స్వజన మిత్ర!
శూరసింహ - సుశుభగాత్ర!!

48. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 60, 5 వ సర్గ, 16 - 21 శ్లోకాలు.

49. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 264, పంక్తులు 501 - 510.

50. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 518, 49 వ సర్గ, 9 - 14 శ్లోకాలు.

51. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 443, పంక్తులు 4861 - 4869.

52. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 724, 726, 70 వ సర్గ, 7 - 10 శ్లోకాలు.

53. శ్రీరమాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 520, పంక్తులు 6721 - 6724.

54. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 4,6, 1 వ సర్గ, 9 - 15 శ్లోకాలు.

55. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు పుటలు 244 - 245, పంక్తులు 35 - 54.

56. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 466, 468, 41 వ సర్గ, 2 - 5 శ్లోకాలు.

57. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 424, పంక్తులు 4395 - 4408.

58. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 166, 13 వ సర్గ, 5వ శ్లోకము.

59. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 305, పంక్తులు 1517 - 1520.

60. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 1112, 119 వ సర్గ, 19 - 21 శ్లోకాలు.

61. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 684 - 685, పంక్తులు 10679 - 10693.

62. శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 70, 7వసర్గ, 2-6 శ్లోకాలు.

విజయభద్రరగడ
రాక్షసాధము లాసనారూఢు లై యుండ-
రాసుడుంతకు నాసనంబు గరువా? యనుచు-
తత్క్షణమె పుచ్ఛమున కాసతీయగ నద్ది-
త్వరితగతిఁ జుట్టలుగ నాసనం బై మించె!

నక్షీణబలబుద్ధిమంతుండు హనుమంతు-
డందఱకు నాడిమూపుల చుఱుకు లంటించె-
లక్షణంబుగను లాంగూలాసనస్థుఁడై-
రావణప్రభువరు నదఃకృతుని గావించె!!

హరిగతిరగడ
నీలావలనిభు డసురపతి గొలుచు-
కైలాసగిరీశ్వరునికి నిధమున!
నాలాసన నుధిరోహించెను హరి-
బ్రహ్మ నెలసె నన మేరువు నగమున!!

"అనతి లేకయు లంకను జొచ్చితి-
నీవనిజత భాషణ మొనరిచితిని!
వానర! వనభవనములను రక్షక-
వరబలముల ధ్వంసం బొనరిచితివి!!

వ్వాని యెవడు బంపెన్ను? నీవెవడవు?-
పురమునఁ దిరిగితి వెందుకు? జంకక!
దానవనాథుని ధర్మాసన మిది-
దండన తగ్గును దెలుపుము బొంకక!!"

హరిగతిరగడ
అని ప్రశ్నించు బ్రహస్తునిఁ గాంచుచు-
హనుమంతుండును నదరక బెదరక!
మనమున హరిపదవనజము లిడికొని-
యనియెను గంభీరాస్యుడు చెదరక!!

## రామదూతహితోపదేశము

### సీసగర్భవిజయభద్రరగడ

బలిపాచికను లేప - బల మేది? నీకు నా-
బలిగర్వ మడగించు - వామనుడు రఘుపతిర!
యిలఁ గార్తవీర్యునకు - నెదురు నిలలేవు, ఆ-
బలుఁ బరశునం గొట్టు - భార్గవుడు రఘుపతి ర!!
శివచాప మెత్త నీ - చేతగా దాయె నా-
శివచాప మెత్తి వం - చెను విఱిచె రఘుపతి ర!
దివిజపతిసుతు పేరు - దిగులుగొల్పును నీకు-
నవలీల నా వాలి - హతము గొనె రఘుపతిర!!
అట్టి రాముని బంటు - నత్యంత బలుఁడ నేఁ-
బట్టితిని రవినిఁ బసి - భావంబునందు నే!
చెట్లుగుట్టలలో వి - శేషించి యుందు నే-
పట్టి సీతను గంటి - భవ్యంబు గాను నే!!

**సీసము**

బలిపాచికను లేప - బల మేది? నీకు నా-
బలిగర్వ మడగించు - వామనుడుర!
యిలఁ గార్తవీర్యునకు - నెదురు నిలలేవు, ఆ
బలుఁ బరశునం గొట్టు - భార్గవుడుర!
శివచాప మెత్త నీ - చేత గా దాయె నా-
శివచాప మెత్తి వం - చెను విఱిచెర!
దివిజపతిసుతు పేరు - దిగులు గొల్పును నీకు
నవలీల నా వాలి - హతము గొనెర!!
గీ. అట్టి రాముని బంటు - నత్యంత బలుఁడ!
బట్టితిని రవినిఁ బసి - భా-వంబునందు!
చెట్లుగుట్టలలో విశేషించి యుందు !
పట్టి సీతను గంటి - భ-వ్యంబు గాను!!

విజయభద్రరగడ

ఆ రాము లంపె నే - నంజనీనందనుడ-
నర్క పుత్రుని మంత్రి - నర్కశిష్యుండ నే!
శ్రీరామునాజ్ఞలను - శిరసావహించి యే-
నారాశి లంఘించి - వచ్చి యున్నాడ నే!!

శూరాగ్రసరు రాము - శుభకరపు ముద్రికను-
సుందరి కిడితిఁ గొంటి - సుదతికుశలంబు నే!
శ్రీరాము జయరాము - సీతాపతే! యంచుఁ-
జింతింతు సతతంబు - శ్రీశు నామంబు నే!!

ఆకొంటి సీతమ్మ - యాజ్ఞానుసారంబు-
చేకొని ఫలములు భ - క్షించు చుండగ భటుల!
హో! కోతి పట్టు డని - యురికి వచ్చును నుండ-
గైకొను డనుచుఁ బండ్లు గాయ లిచ్చిరి నిటుల!!

మట్టుముట్టిరి వారు - పట్టఁ జూచిరి కాని-
పట్టుకొనగ లేక - కొట్టఁ జొచ్చిరి నన్ను!
జెట్టుకొమ్మలు విఱచి - చేతనగు నంతలో-
నట్టై దట్టించుమను - నడలఁగొట్టితిఁ దన్ను!!

తన్ను డనుమును శస్త్ర - ధరులు పైఁబడి రంత-
దరువులను బెకలించి - తాడనము సేసితిని!
దన్నుఁ దాఁ గామటయె - ధర్మంబు గాఁ నెఱిగి-
తిన్నగా నవ్వారి - దివి కంపివేసితిని!!

రాక్షసులు పెచ్చి నను - రాపాడ రెచ్చితిని-
వృక్షసాధనులఁ బడ - వేసితిని నే మినుమ!
లక్ష యాదుల రణా - హ్వానమునఁ బోరితి జ-
యాపజయములు నీశ్వ - రాధీనము లవి సుమ!!

బ్రహ్మాన్వయమున సం - భవమైతి రావణ-
బ్రహ్మఖ్య! వేదశా - స్త్రజ్ఞుడవు యజ్ఞాది!
బ్రహ్మకర్మ లొనర్చి - పడసితివి సత్కీర్తి-
బ్రాహ్మణుడ,! స్త్రీలోల,! - పతితుడ,! యహంవాది!!

తెలివి లే నతగానిఁ - దెలుపంగ వచ్చుఁ గద-
తెలిసిన విమూర్ఖునకుఁ - దెలుప బ్రహ్మకుఁ దరమె-
యిల నిద్రితుని లేపఁ - గల మికఁ గపటనిద్ర-
గల వాని మేల్కొల్ప - గల్గుటది దుస్తరమె!!

మానవుని చేతిలో - మరణంబు గోరితిని-
మానవాకారుడు ర - మానాథు డుదయించె!
మానవా? యీ దురభి-మానము, నిలుపుకొనుము-
మానము, ననుచును హను - మానుండు బోధించె!!

ఆ రామునకు నీకు - హస్తిమశకాంతరము-
పోరుననతని సములు - వీరు లీ లోకముల!
లేరన నధికు లె-వ్వార? లీ ధారుణినిఁ-
గోరుకొని తెచ్చుకొన - కుమయింక వైరముల!!

రాముండు విను పరం - ధాముండు, లోకాభి-
రాముండు దుర్జనవి - రాముండు, శత్రుజన
భీముండు నాశ్రితా - రాముండు, నాతనికి-
భూమిజాలలనాల-లామ నొసగుమ సుజన!!

రక్షకుఁడు రఘువరుం - డీక్షణమె నినుఁ గులము-
రక్షించునుభయ సుఖ-మక్షయ్యం బందెదవు!
కక్షలను వీడక వి - పక్ష మూనితి వేని
వీక్షింప సురలు స ర్వక్షయము నొందెదవు!!

కలఁ బోలు విషయసుఖ - ముల భ్రాంతి వీడి రా-
ముల నుదిఁ బదిలపఱచి - సలుపు వ్యవహారంబు!
తలవఁగా మును గూర్చు - వలయు నాకులను జే-
తులు గాలకుండ నని - పలికె కపి సింహంబు!!

ద్విరదగతిరగడ

పండితాగ్రణి పలుకు - లుండె మండెడు నవల!
కుండమున నాజ్యంపుఁ - గుండ దొరలిన యటుల!!
మండిపడి రావణుడు - దుండగుని మెత్తగా!
ఖండింతు నని కలుకు - ఖడ్గంబు నెత్తగా!!
దండి దొరలకు దూత - ఖండించు టనుచితము!
దండన మితక మొకటి - దగ వేయుట యుచితము!!
దండ మిడి విన్న పో - దరు డిట్లు ప్రార్థించెఁ!
జండతరశాసనుడు - శాంతించి మన్నించె!!
కోతులకుఁ దోక కడుఁ - బ్రీతి దానికి తగును!
ప్రాత బట్టలు చుట్టి - బహుతైలమున ముంచి!!
పీతి హోత్రునిఁ దగులఁ - బెట్టి త్రిప్పుట తగును!
దూతను దగిన శాస్తి - తో నంపుటయు నగును!!
చేత మన దిది గని ని - చేతస్కులై కపులు!
భీతిల్లి మిక్కిలిగఁ బెదరిపోదురు, రిపులు!!
కాతరులు వనచరులు చేతగాదని పోరు-!
సీతను గుఱించి యికఁ జింతింపఁగాఁ బోరు!!
ఈ లీల తీరు పసు రేంద్రు డిడి తన సభను!
జాలించి వెడలె ని ర్జరసభాసన్నిభను!!

విజయభద్రరగడ

ఒక్క శరమున నేల - కొఱగెఁ బిట్టలు రెండు-
చొక్కమగు మన రాజు - సూక్ష్మబుద్ధికి ముందు!

మొక్కవోవును సురల - దిక్కు గురుబుద్ధియని-
మ్రొక్కిరి సభికు లెల్ల చక్క నౌ సభయందు!!

## లంకావిధ్వంసము

### ద్విరదగతిరగడమాల

బాలిశులు దైత్యు లవ - హేళనల నొప్పించి!
చాలగాఁ బురిలోని - చేలాలు దెప్పించి!!

వాలంబు పొడుగునను - వాలాయముగఁ జుట్టి!
వాలము పెరుగుచుఁ జనె - చేలము గొఱతపట్టి!!

ఆలోచనకుఁ దట్టె - దీ లీల పురమందు!
చేలము లొడిసె నౌదిగె వాలంబు దన యందు!!

లీలగా బయలు వెడ - లెడు భుజంగము భీతి!
రాలేక పుట్టను మ - ఱలి యణగె నను రీతి!!

తైలంబు వోయుచును - దడిపి రాతని తోక!
కాల కింకరులకుం - బోలు భటులును వీక!!

ఆలసించక యప్పు - డంటించిఁ తోక కొన!
చాల జాగ్రత్తగా-సైనికులు వట్టుకొన!!

### మహావిజయభద్రరగడ

మేళతాళాలు బా - జాలును బజంత్రీలు
డోలు జమడిక నగా- రాలు - ఢంకాలు భే-
రీలు తప్పెట్లు బా - కాల చప్పు ళ్ళన్ని -
మేళవించుచు నంత - రాళమున నిండగా!
కూళ లగు రాక్షసుల - కూటములు నవ్వనా-
వేళ వేళాకోళ - విధ మతిశయిల్ల గా
వేల కొలదిగ సేన - వెన్నంటి నడువగా
కోలాహలమ్మొ ది - క్కుల నిండ మెండుగా !!

చోరుండు, దానవవి - దారుండు, ఘనరా-
కారుండు, నక్షుకు - మారాంతకుడు, ద్రోహి-
చారు డుద్యానవా - శంకరుండును, మహా
నేరస్థు డని ప్రజలు - నిందించు చుండగా!

బారుబారులు దీరి - దారి కిరు ప్రక్కలను-
పౌర జనములు భయ - భ్రాంతులై చూడగా-
నూరేగుచును వచ్చి - మారుతినిఁ బశ్చిమ-
ద్వారంబు కడఁ జేర్చి - దునుజభటు లుండగా !!

హరిగతిరగడ

వాలాభీలజ్వాలాజిహ్వుడు
కీలల నాల్కలు గోరుచు నుండెను!
ఆలస్యము విష మని లంక నొకే
యాహుతి గొన సిద్ధపడుచు నుండెను!!

విజయభద్రరగడ

హరిరాయఁ డుబ్బెఁ గ - ట్లన్ని దెగె పటపటన-
దొరకొనిన భటగణము - ద్రుంచుచును జెలరేగె!
గిరికాయు పుచ్ఛాగ్ని - కీలలు విజృంభించె
పిరాపిరా మనుచు బలము - భీతి దూరము కేగె!!

బరబర మనుచు మండు - వాలంబు నెత్త నది-
సురవరుల కారతులు - నూపిన ట్లనిపించె!
గిరగిరను ద్రిప్పిన న - సురుల బరిమార్చుటకు-
సరసరన వచ్చు హరి - చక్రమును దలపించె!!

హరుని నిటలంపు నే - త్రాగ్నియే యిది యనుచుఁ-
బురపురను బొక్కెనా - సురపురీదుర్గంబు!
హరిహరీ యనుచు హరి-హరిగర్జనము సేయ-
నంతరాళము నిండె - నదరె రిపువర్గంబు!!

లాంగూలపుం జ్వాల - నింగినే మ్రింగు ననఁ-
జంగుచంగున నెగిరి - సౌధముల నంటించె!
శృంగారభవనముల - భంగ మొనరించుచును-
బంగారు మేడలను - భస్మంబు గావించె!!

మును భార్గవుఁడు లోక - మునఁ బుణ్యుఁడయ్యె
పితృవాక్య మొనరించి - పృథివి ననేకు
లతిశయ విఖ్యాతు - లందిరి మఱియు
నేనట్లు తండ్రికి - హితమాచరింపఁ
బూనితి దాన నె - ప్పుడు పోనిరాదు
అమ్మ! నీకిటులాడ - నగునే" యటంచుఁ"[11]

తాను అడవులకు వెళ్లడానికి అనుజ్ఞ ఇవ్వమని శ్రీరాముడు తల్లిని కోరాడు. అందులకు ఆమె కుమారునితో ఈ విధంగా చెప్పింది.

"నీవు లేనట్టి నా - నియమంబులేల?
యీ విశ్వ జనులచే - నెన్నికయేల?
తగవేల? సుఖమేల? - ధర్మంబులేల?
పగయేల? హితమేల? - పదవులదేల?
అమరలోకంబైన - నదియేల? సర్వ
సమచరిత్రునిఁ సత్య - సంధుఁ గుమారు
నిన్నుఁ జూచుచుఁ జెంత - నేయున్నఁ జాలు
నన్నియు నేనొల్ల - నన్యంబులైన "[12]

కౌసల్య, శ్రీరాముని పాత్రలను కవియెంత సజీవంగా చిత్రించాడో పై ద్విపద పంక్తుల వల్ల తెలుస్తోంది.

4) రాముణ్ణి వనవాసానికి వెళ్లమని దశరథుడు చేసిన ఆజ్ఞ లక్ష్మణుణ్ణి కోపోద్రిక్తుణ్ణి చేసింది. శ్రీరాముడు లక్ష్మణుని కోపాన్ని పోగొట్టడాన్ని కవి యీ విధంగా వ్రాశాడు.

"శోకరోషంబుల - సుడి గొనియుండ
నీకేల? విభు మాన - నీయుఁగాఁ గనుము
వలవదీ యభిషేక - వార్త చిత్తంబు
నిలువఁ బట్టుము నావ - నీ ప్రయాణంబు
నభిషేకయత్నంబు - నటుల చేకూర్చి
యభిమతింపుము కైక - యనుమానముడుపు
గణుతింప నాసాధ్వి - కడనాహితంబు
ఊణమైనఁ దామ - సించఁగ రాదు నాకుఁ

మరాళగతిరగడ

శ్రద్ధను నొకతెను చేతఁ బట్టుకొని-
పెద్దవి వెంబడి పరుగిడు చుండగ!
నొద్దిక భుజమున నొకతె నుంచుకొని-
ముద్దుల చిన్నది చంకన నుండగ!!

దద్దయుఁ బొట్టను దాల్చుచు నొకతెను-
నిద్దురగొను బిడ్డను ద్యజియించెను!
నద్దానిని రక్షించు నెవం డని-
యతిసంతతి వతి యాక్రోశించెను.!!

యిల్లు గాన డిల్లాలినిఁ గానడు-
పిల్లాజెల్లా ప్రేమలఁ గానడు!
కల్లుకుండ చంకనఁ గొని విడువం-
డెల్ల వేళలను ద్రాగుడు మానడు,!!

మెల్లన దివి విడి భువి వచ్చితి వని-
యుల్లాసంబున నూగుచు వచ్చెను,!
తల్లీ! నిన్నే సేవింతు ననుచుఁ-
ద్రుళ్లుచుఁ దూలుచునుం బోఁ జొచ్చెను.!!

విజయభద్రరగడ

పురజనుల విలాడము

"ఏనాటి పాపమో! - యెవరి దీ శాపమో!-
యీాన ము ముందు బడి - యేడిపంచగఁ జొచ్చె.!
నానాడు పంచ::టి - యడవిలో నొంటి దగు
జానకినిఁ దెచ్చెఁ గ - ష్టములు దోడుగ వచ్చె.!!

మౌనులను ఋషుల నవ - మానాల పాల్చేసె-
మానవతు లైనట్టి - మానినులఁ జెఱఁ బెట్టె!
ధ్యానమ్మునం గెల్చి - ప్రాణలింగమ్ము గొనె-
నానందికేశు శా - పానలము నొడిఁగట్టె!!

జానకీ శోకసం - జాతదావాగ్ని లో-
దానవపురీవనము - దగ్ధమగు చుండెఁ గద!
భూనాథు డొనరించు - బుణ్యపాప ఫలాలు-
భూరిసుఖదుఃఖాలు - పురజనుల నంటు గద!!
వట్టి మూర్ఖుఁడు రాజు - పట్టు విడువఁడు దాను

బట్టు కుందేలు నకుఁ - బాదాలు మూ డనును!
బట్టు కొనె వాని శని - వచ్చెఁ బోగాల" మని-
యెట్టకేలకును బ్రజ - యిట్టు లనుకొని జనును.!!

కట్టుబట్టలతోడ - బట్టబయలునఁ బడుచుఁ-
జుట్టాల బక్కాల - జోలి మఱచిరి వారు!
కొట్టుమిట్టాడుచును - గోడుగోడున నేడ్చి-
చెట్టుకో గుట్టకో - చేరుచుండిరి వారు!!

సౌరి దశ శిరుని శా - సనము గొని భీతిఁ దరు-
చరవరుని నెదిరించ - సాహసము గొని తరలె!
మారుతి ఘనుని తోక - మంటల కొడల వలన-
మాడె, నల్ల మొగమున - మందు డాగక మఱలె!!

ముక్కనను ద్రే లిడి వి - మోహచిత్తుండు దశ-
ముఖుఁడు సూచుచు నుండ - మూతి మీదను నొక్క!
ప్రక్క మీసము పైన - భగ్గుభగ్గున మండు-
వాలకీలలఁ దుడిచి - వానరుఁడు గడు నిక్క!!

దిక్కు గానక యెట్టి - దిక్కు గానక రాజు-
వెక్కస పడుచు మిగుల - విసిగి కడు వేసారె!
పక్కపక్కన నగుచు - వెక్కిరించెడు సురలఁ-
జుక్కల ప థము నందు - సురసుర గనుచుఁ బారె!!

జనకసుత శక్తులకు - జనని గావున జగ-
జ్జనని యాజ్ఞల వలనఁ - జల్లఁబడె ననలుండు!
అనిలుండు దన మిత్రు - డగుటచే నాతండు-
ననిల సుతునకు నెట్టి - హాని దలపక యుండు!!

ఆర్భాటముల తోడ - నట్టహాసము గూడ -
దోర్బలుఁడు శరనిధినిఁ - దోక ముంచగఁ బోగ!
గర్భస్థప్రాణులను - గాపాడుకొన రత్న-
గర్భుండు దన వీచి - కల నంపె నెదురేగ!!

## మారుతి యార్తి

### మరాళగతిరగడ

ఎందుకో హనుమ హటాత్తుగ నమితభ -
యాందోళన చే నీరైపోయెను!
సందేహపరంపరలు ముసురుకొనఁ-
జతికిలఁబడి యతివిహ్వలు డాయెను!!

చేసిన యత్నం బంతయు బూడిదఁ-
బోసిన పన్నీ రాయెను గటకట!
నా సాహసపు ప్రమత్త వృత్తికిన్-
నా సీతమ్మను బలిగొంటి నకట!!

ఏ మొగమునఁ గిష్కింధకుఁ బోదును-
నేమని చెప్పుదు సుగ్రీవునకున్!
క్షేమమె సీతకు నని యడిగిన బదు-
లేమందును స్వామికి రామునకున్!!

జనకజమృతిభీషణదుర్వార్తను-
విని హా! హా! యని రామలక్ష్మణులు!
సనిపోదురు, సుగ్రీవవానరులు-
మునిభరతాదు లయోధ్యావాసులు!!

ఇందఱు చావున కేకకారకుడ-
నే నగుదు ననుచుఁ గడు వాపోయెను!
అందఱు రక్షించుటకై తా నొక-
డంత మొందఁ గృతనిశ్చయు డాయెను!!

6) భరతుడు అడవుల్లో వున్న శ్రీరాముని వద్దకు వెళ్లి, తండ్రి తనకిచ్చిన రాజ్యాన్ని పరిగ్రహించమని ఈ విధంగా కోరాడు :

"దేవ! మీయానతి - తెఱఁగెల్ల వింటి
భావింపఁ డెఱుఁగక - పల్కుట గాదు
వసుమతి కైకకు - వసుధేశుఁడిచ్చె
నసమ వైఖరినిచ్చె - నాయమ్మ నాకు
నాచేతఁగాక యెం - తయుఁనుఁ బ్రార్థించి
మీచేతి కిచ్చితి - మేదినీ భరము
అధికార మెఱుఁగక - యవని నాసించు
నధముని రాజని - యందురే జనులు?
సింగంబునకు నమ - ర్చిన యామిషంబు
చెంగక శునక మా - సింపఁ జేకురునె?
గరుడని గమనంబు - కాకికిఁ దగునె?
ఖరమువోవునె తురం - గమము చందమున?
నీదైన రాజ్యంబు - నీచేతఁ గాక
యోదేవ! పాలింప - నోపునే యొకఁడు?
ధరణీ రుహంబులఁ - దాఁ బ్రయత్నమున
పరిపాలనము చేసి - ఫలమందు వేళ
యవివీటిఁ బుచ్చిన - యట్టు లిన్నాళ్లు
నవమతి లేక మ - మ్మరసి రక్షించి
పగవానిఁ జూచిన - పగిదిగాఁ జూచి
దిగ విడిచిన నేది - దిక్కు మాకింక?
మమ్మునీ చేతికి - మాతండ్రి యిచ్చె
నెమ్మది తానేఁగె - నీవింకమీఁద
మమ్ము రక్షింపక - మాట లాడినను
సమ్మతమే మహీ - జనుల కిందఱికి
జనులెల్ల మీరు రా - జ్యము సేయఁగోరి
నను రమ్మనఁగ వచ్చి - నాఁడ మీకడకు
వారేల యిలయేల - వలసినట్లయ్యో!
నోరామ! మిముఁ - గొల్చి యుండెద నేను

రాజీవ నేత్రునకు - రారాజు పుత్రునకు-
రాక్షసవిజేతకును - త్రైలోక్యత్రాతకును!
జేజేలు వలికి సం - జీవరాయం డపుడు-
చెప్పం దొడంగె నిటు - సీతకును మాతకును!!

**వార్తావిశేషముల నివేదన**

**మరాళగతిరగడ**

"వనము నేల మట్టము సేసితి రిపు-
బలములను బెద్దనిద్దుర బుచ్చితి!
దనుజపతికి హితవు గరపి లంకను-
దగ్ధము సేసితి మిము గన వచ్చితి!!"

**విజయభద్రరగడ**

అని యిట్టు లనిలసుతు. - డమితపులకితగాత్రు,-
డశ్రుపూరితనేత్రు, - డంజలిపుటుం డగుచు
"వనజనాభుండు హరి - వర లక్ష్మణులం గూడి-
వచ్చు శీఘ్రముగ నీ - వ్యథలు మానుపు" ననుచు!!

ఉత్సాహమున హనుమ - యుఱ్ఱూత లూగుచును-
నుర్విజాచరణముల - నుంచెం దన శీర్షంబు!
వత్స! మేలగు నీకు, - వసుధాస్థలము నందు-
వాసికెక్కుమురా యా - బ్రహ్మకల్పాంతంబు!!

ప్రోత్సహించెడు నిట్లు - భూమీ తనయను గని-
పోయివచ్చెద నమ్మ - భువనేశుం జూడ ననం!
"గుత్సితుండు రావణుండు - గొనముట్టు వర కెట్లొ-
కొనయూపిరినిం దాల్చు కొందు" నని యాపె యన!!

సీత కాతడు ప్రద - క్షిణము లర్పించి తన
చేతులను జోడించి - సెల వనిన యా [illegible]క-!
మాత యాతనినిం గడు - మమతతో దీవించి-
"నీతిమంతా! యంజ - నీపుత్ర! యిందాక!!

లెల్లమెచ్చు వహింప - కేమనవచ్చు

---------------------------------

---------------------------------

కొనసాగ కున్నచో - కొడుకు లేమిటికి?"[18]

ఇట్లు, శ్రీరామ భరతుల సంవాదమును వరదరాజు పండిత పామరుల చెవులకింపు గల్గించు నటుల రచించాడు. పై విధంగా శ్రీరామాయణంలోని పాత్రలన్నీ సముచిత వర్తనలతోను, తమ తమ దృక్కోణాల నుంచి ఎదుటి పాత్రలతో సంభాషించడం ద్వారానూ సజీవమైన చక్కని చైతన్య దీప్తిని పొందాయి.

## 3.2 వర్ణనలు :

కావ్యంలో అష్టాదశ వర్ణనలుండడం కవితా సంప్రదాయం. ప్రబంధకవులు వర్ణనలకు అగ్రతాంబూలం ఇచ్చారు. కవి తాను ఊహించిన దృశ్యాన్ని కన్నులకు కట్టినట్లు చేయడానికి వర్ణనలు చేస్తాడని విమర్శకుల అభిప్రాయం.[19] రసప్రధానమైన ప్రబంధాలకు వర్ణనలెంతో ఆవశ్యకం.

ఆలోచనాశక్తి ఏకవస్తు విషయ కేంద్రికృతం కావడానికి ఆవస్తు పరిశీలనా దృష్టి సమగ్ర సుందరమై వర్ణనాత్మకంగా వుండాలి. అట్టి ఏకాగ్ర మనః స్థితిలోనే భావం ఉద్భవిస్తుంది. భావతీవ్రత అనుభవ యోగ్యమగుటకు కారణం రసోత్పాదకత. ఈ హేతువు వల్ల రసప్రాధాన్యం కలిగిన ప్రబంధాలకు వర్ణనలు ఆవశ్యకమయ్యాయి.

తెలుగు సాహిత్యంలో అష్టాదశ వర్ణనల ప్రసక్తి మొట్టమొదటిసారిగా నన్నెచోడుని కుమార సంభవంలో చూడవచ్చు.[20] విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ఈ వర్ణనలే కన్పిస్తాయి.[21] అయితే అప్పకవి, పదునెనిమిది వర్ణనలకు అదనంగా ఇంకోనాల్గింటిని చేర్చి ఇరవైరెండు వర్ణనలుండడం ప్రబంధ లక్షణంగా నిర్దేశించాడు.[22] ఆశ్రమ, కన్యాంగ సౌందర్య, దౌహృద, మృగయా - అనేవి అప్పకవి చెప్పిన నూతన వర్ణనాంశాలు. ఈ అష్టాదశ వర్ణనల్లో రవి, శశి, అంబునిధి, ఋతు, నగవర్ణనలు ప్రకృతి వర్ణనలు. తక్కినవి వస్తువిషయక వర్ణనలు.

వరదరాజు శ్రీరామాయణంలోని వర్ణనల్ని మూడు విధాలుగా విభజించవచ్చు.

1. కథానుగుణ వర్ణనలు :

ఉదా :- i) భగవంతుని వర్ణన, ii) పురవర్ణన

అని యను నా యమను మిగుల-
ననునయించి విక్రముండు!
ననిలగతిని నేగె సువే-
లాద్రిపైఁ బరాక్రముండు!!

**తిరుగు ప్రయాణము -సూర్యోదయము**

**మహా ప్రవాళరగడ**

సత్తువ కొలది యును వాయు-
సత్త్వుడు దన పాదంబుల-
నొత్తెను, నా యుర్వీధర-
ముర్వికి సమమై నిల్చెను!
ఉత్తము డా మహోదధిని-
నుత్తరించ నభము నందు-
నుత్తరాభిముఖుడు మఱొక-
దుష్ణకిరణుఁడనఁ బొల్చెను!!

**విజయభద్రరగడ**

ఇనవంశ రాజేంద్రు - నిల్లాలు కుశలంబు-
గొనివచ్చు నాంజనే - యునికి స్వాగతము లిడ!
నినుడు దోచెను గపుల - హృదయాబ్జములు విప్ప-
జనకసుతదుఃఖసం - జాతతమములును విడ!!

న్యాయ సమ్మతిని - నభి-నందనలు మారుతికి-
ప్రియసీశుభవార్త - శ్రీపతికి నందించె!
వేయి కిరణాలు గల - వేలు పపుడే రామ-
రాయని సతికి శుభప - రంపరల నంపించె!!

**ప్రవాళరగడ**

శ్రీరామా! జేజే యని - సింహనాద మొసరించెను!
నా రవమ్ము మారుమ్రోగి - యవ్వలి దరి వినిపించెను!!
వీరవరుఁడు వచ్చె నదిగొ - వెలది సీత జాడ దెచ్చె!
ధీరుడహో! యనగఁ గపికి - శౌరుఁడు దిగె ముదము హెచ్చె!!

చూచితి సీతమ్మ, నహో! - చూచితి శ్రీరామసతినిఁ!
జూచితి జనకజ, నవనిజఁ - జూచితి నినెడు మారుతిని!!

**అంగదాదుల యుత్సాహము**

మ్రొక్కు నొకఁడు బాదాలకు-
మ్రొక్కిన దీవించు నొకఁడు,!
చక్కగ వాలము స్పృశించి-
చాల ముద్దులు గొను నొకఁడు!!

అక్కునఁ జేర్చుకొను నొకఁడు-
చెక్కిలి గొని పుణుకు నొకఁడు!
మక్కువ నాతని కరమును-
నొక్కుఁ దన కరమున నొకఁడు,!!

ఒక్కడు చుట్టూర దిరుగు-
నొక్కఁడు నృత్యంబు సేయు,!
గ్రక్కున నెత్తుకొని యొకఁడు-
గంతు లనేకములు వేయు.!!

**మహోగ్రవాళరగడ**

కోలాహల మంత నాపి-
కోపించుచు ఋక్షనాథు,-
"డీలీలను మన మురిపెపు-
లీల లింకఁ జాలు నిచట!

కాలయాపనంబు దగదు-
ఘను లీ సంతోషంబునఁ-
బాలుపంచుకొన వేడుక-
పడుచు వేచి యుందు రచట!!

(ప్రవాళరగడ

విందుము గావుత! నిపు డర-
విందనయనకుశలము మన-
సందేహము దీరఁ బవన-
నందను శుభముఖమునఁ" నన!!

**మరాళగతిరగడ**

"మెప్పించితి సురసను, మైనాకుని-
ఒప్పించితిని, మహాజలరాశినిఁ!
గుప్పగూల నా ఛాయాగ్రహమును-
గూల్చితి, సింహిక యను రాకాసిని.!!

శరనిధి దాటితి, సూటిగాను న-
ద్దరిఁ జేరితి, లంకానగరంబున!
బరిమార్చితి లంకను, సీతా స-
చ్చరితను గంటి నశోకవనంబున!!

వనభంగము, వైరి శృంగభంగము-
నొనరించితి, రావణు బోధించితి,!
ననలునికాహుతి నిచ్చితి లంకను-
నవనిజకుశలము మీ కెరిగించితి"!!

**మహా ప్రవాళరగడ**

అని పావని యన యువ రా-
జంగదుండు హర్షించుచు-
"ననఘా! నీ యుపకార మ-
నర్ఘం" బనుచును నుతించి,!
"చనవలె శీఘ్రమె శ్రీరా-
ముని సాన్నిధ్యంబు" కనగ-
వనచరు లందఱు మేల్మే-
లని వాతగతిఁ బయనించి.!!

**మధువనవినాశము**

మధువిస్తారస్రవిత, సు-
మధురఫలభరిత కపిరా-
ణ్మధువనమున, లాలసులై
మధుపములో యనవ్రాలిరి!
దధిముఖది రక్షకులను-
దరిమి పారద్రోలి, మధువు-
క్షుధ దీరగ గ్రోలి వనము-
సూరగొనుచుఁ గడుఁ గ్రాలిరి!!

ప్రవాళరగడ
న్యాయము కోరుచు దధివ-
క్త్రాదు లురికి సవినయమున!
వాయి దెఱువ లేక యెట్లొ-
పలికిరి ప్రభువుకు భయమున,!!

"వాయుసుతుఁడు నంగనాది-
వానరులట మధువనమ్ము-
పాయక యొనరిచిరి వమ్ము
పారద్రోలినారు మమ్ము.!!

విధియించుడి వారికి దగు-
విధపు కఠినశిక్ష లీరు!
విధివిధానములను మఱచి-
విఱ్ఱవీగుచున్న వారు!!

వనచరభూపతి హర్షము-
వట్టలేక గంతువేసె,!
"ననిలసుతుఁడు గాంచి వచ్చె-
నవనిజ" నని అంకవేసె!!

విని హరి నిజమా,? కలయా?,-
విభ్రాంతియ? యనుచు లేచె!
జనకజకుశలమును దెచ్చు-
జనమాన్యుని గలయఁజూచె!!

దాశరధికి రవిసుతుఁ డనెఁ-
"దథ్య మిద్ది గానియెడల!
గీశవరుల మధువనప్ర-
వేశమశక్య మీ యెడల!!

శ్రీశ! మధువనమ్ము సొరగఁ-
జీమకుఁ దరమ? సుగ్రీవ!
శాసనమ్ము మీరుట యన-
సంచకరి యిడుటయ చావ!!

అన్యులకు నసాధ్యమైన-
హరికార్యము సాధించెను,!
పుణ్యుఁడభయ మిడి త్రిలోక-
పూజ్యుఁడయ్యె" భటుల కనెను!!

"మాన్యవరుని గౌరవమున-
మా కడకుం జేరఁదెండు,!
ధన్యునిఁ గన వేడుకపడు-
దాశరథియు, వేగఁ బొండు.!!

ఆనతి విని భ్రాంతు లనూ-
హ్యం బియ్యది యనుచు నెంచి!
యాననములు వెలవెలఁబో-
నా భటులు శిరములు వంచి!!

స్వామి! సరే యని చని వన-
చరకుంజరునిం జేరిరి!
స్వామిభక్తిపరాయణుని-
జయపరంపరలు గోరిరి!!

"జయ! జయ! శ్రీరామదూత!-
జయ! సీతాప్రాణదాత!
జయ! రాక్షసకులవిఘాతఁ!-
జయ! జయ! యభయప్రదాత!!

స్వాగతమ్ము హనుమంతా!-
స్వాగతమ్ము బలవంతా!
స్వాగతమ్ము నీకిదె సు-
స్వాగతమ్ము ధీమంతా.!!

యోగేశుఁడు, జానకీ వి-
యోగదుఃఖితుఁడు రాముఁడు!
వేగిరముగ నిన్నుఁ గాంచ-
వేచి యుండు శ్రీధాముఁడు.!!

త్యాగధనుఁడు సుగ్రీవుఁడు-
దద్దయు మమ్మంపినాడు.!
ఆగక తత్క్షణమే ర-
మ్మనుచు నిన్ను బంచినాడు!!"

అన విని యాక్షణమె యంగ-
దాదియుతుఁడు హనుమానుఁడు!
చని యె నొక్కగంతున రా-
ముని సన్నిధి ధీమానుఁడు!!

గని రఘువరు మూడు ప్రద-
క్షిణములుగొని ముందు మ్రొక్కె!
నినతనయుని నా పిమ్మట-
వినుతి సేసి నుతికి నెక్కె.!!

## సీతాదేవి కుశలవార్త

### మహాప్రవాళరగడ

చూచితి సీతను రామ య-
శోకవనమునందున శిం-
శుపపు వృక్షమూలమం ద-
సురవనితల రక్షణమున!
వేచిచూచు నీ మార్గము-
వేయి కనుల జనకజ నిను-
వేగ వచ్చి కావు మనుచు-
వేడుకొను ననుక్షణమున.!!

### ప్రవాళరగడ

ఆ వైదేహి యతిదీన - యసురక్రూరమృగమధ్యన!
గోవు రీతి గాను గడుపు - కొను దినము మహాయుగమన,!!

కలికి మీ వియోగం బర - ఘడియయు నోపదు వరాంగి!
జలములఁ బాసి బయట విల - విలలాడెడు ఝషము భంగి.!!

కోమలి కుములును శత్రువు - కును వద్దని యట్టి శిక్ష!
రామ నీదు నామమె యా - రామకు శ్రీరామరక్ష!!

వామాంగి ధరించును నీ - ప్రాప్తికొఱకు తనప్రాణము!
ఏమరక యొనర్చెడు నా - లేమ సతము నీ ధ్యానము!!

రామనామ మే యన్నము-రామనామ మే పానము!
రామనామ మే నిద్రయు-రామనామ మే స్నానము!!

శ్రీరామా! జానకీ చ-కోర మెదిరి చూచు గనుచు!
నీ రాకా చంద్రు రాకకు-కోరామా! రామ! యనుచు.!!

వారధి దాటితి కావలి- వనితను లంకను ద్రుంచితి,!
కారుణికాత్మను గని మీ-కరముద్రిక నర్పించితి!!

మహోప్రవాళరగడ

వనభంగమొనర్చి యెదురు-
వచ్చు వారిఁ గూల్చితి రా-
వణికిఁ బట్టు వడితిని రా-
వణునకు హితముం జెప్పితిఁ!

జని లంకను గాల్చితి రా-
క్షసులు హా! యనుచు నేడ్వగ-
వననిధి దాటితిఁ, దెచ్చితి,
జనకజ సిగమణి యొప్పితి!!

అని చూడామణి యొసగిన-
నందుకొనుచు శ్రీరాముం-
డవనిజసాంగత్య సుఖం-
బనుభవించె, నానందము!

ఘనుని హృదయమున నిండెను-
గనుల మత్తడులు దుమికెను,-
దనువు మఱచె నతఁడు గొంత-
తడవున కనె నీ చందము.!!

**3.2.2 పాత్రానుగుణ వర్ణనలు :**

**(1) సుతజననము :**

వరదరాజు దశరథునితో కౌసల్యాదిరాణులకు 'పుంసవనాదికంబులెనయు వేడుకల్ కావించాడు. ఈ రాణులు రామాదుల్ని ప్రసవించారు. అప్పుడు అయోధ్య అంతాపండుగచేసికొన్నది. దేవతాదుందుభులు ఆకాశం నుంచి వినబడ్డాయి. గంధర్వ స్త్రీలు పాడారు. అప్సరలు నాట్యం చేశారు. పురజనులు ఆనందంలో తేలియాడారు. 'పొంగెను విల్లెత్తు పొడవు ధరిత్రి, మంగళాలంకారమయమయ్యె7బురము' అని వరదరాజు వర్ణన చేశాడు :

"ఆవేళభువినిండె - నలరులవాన
దేవతాదుందుభుల్- దివి నెల్లమొరసె
పాడిరి గంధర్వ - భామినుల్ మింట
నాడిరి లాస్యంబు - లప్సరాంగనలు
మలసె వాసనలతో - మలయమారుతము
వెలసె వేలుపుల దీ-వెన లాకసమునఁ
బురజను లానంద-మునఁదే లిరపుడు
ధరణీ శుతపము నెం-తయు నిండఁబండె
పొంగెను విల్లెత్తు - పొడవు ధరిత్రి
మంగళా లంకారమయ-మయ్యెఁబురము."[32]

రామజననంతో భూమి విల్లెత్తు పొంగిందని కవి ఒక అద్భుతరమణీయ భావనను చక్కగా ఊహించాడు. విల్లెత్తు పొంగుట అనుమాట శ్రీరాముని ధనుర్వేదప్రౌఢిని ధ్వనింపజేస్తూవుంది. అంతేగాకుండా శ్రీరాముడు తనధనుర్వేద పాండిత్యంతో బాలకాండం నుంచి యుద్ధకాండం వరకు చేసిన కార్యాల్ని సూచిస్తున్నది. 'మంగళాలంకారమయమయ్యెఁబురము' - అనుమాటరాముడు జన్మించగా, రాజ్యంలో ఈతిబాధలు, కలహాలు లేకుండా ప్రజల్లంతా సుఖస్వప్నంగా ఉండినారనే అభిప్రాయం ధ్వనితమౌతూవుంది.

వరదరాజు తాటకయొక్క ఆకారాన్ని సులభగ్రాహ్యంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు. తాటకి శరీరాన్ని కాటుకకొండతోను, చన్నుల్ని అరిశెలతోను, చెవుల్ని గవనివాకిళ్లతోను, పళ్లను గవ్వలతోను పోల్చి కవి వర్ణించాడు.

వృషభగతిరగడ

పెద్దవారల బుద్ధి నెవ్వఁడు-
పడచెవినిఁ బెట్టునో వానికి-
వద్దు వద్దని వేడుకొన్నను-
బహుళకష్టము వచ్చు. రాదా?!
హద్దు మీరుచు రామునిం గా -
దన్న సీతకు లంకలోపల-
పెద్దకాలము రావణుని చెఱ-
పీడ వో దిది నిజము కాదా?!!

గురువు త్రిగుణాతీతుడై కద-
గురుతరపు భవజలధి దాటెను,-
గురిగలుగు శిష్యుల కొఱకు నై-
గోప్యతారక మిచ్చి పొల్చెను!
సురస, మైనాకు, లనుసింహికం-
హరి జయించెను వనధి దాటెను-
తరుణిసీతాదుఃఖసాగర-
తారకుండై భువిని నిల్చెను!!

### మంగళ మహాశ్రీ గర్భ విజయభద్రరగడ

మంగళము రాములకు, - మంగళసురూపునకు, -
మంగళము సీతకు, సు - మంగలికి నింపొను!
నింగి విడనాడి భువి - వంగినది మేఘమె య-
నంగc జను శ్యామలశు - భాంగునకు మే లౌను!!

రంగుగను భూమిపై - బంగరు తటిల్లత సె-
లంగె నన కోమలల - తాంగికి మహాశ్రీని!
సంగత మొనర్పను వె - లుంగ నవరత్నములు-
నంగనలు పాడి రిల - మంగళ మహాశ్రీని!!

### మంగళమహాశ్రీ

మంగళము రాములకు - మంగళ సురూపునకు-
మంగళము సీతకు సు - మంగలికి నింపొ!
నింగి విడనాడి భువి - వంగినది మేఘమె య-
నంగc జను శ్యామలశు - భాంగునకు మే లౌ!!

రంగుగను భూమిపై - బంగరు తటిల్లత సె-
లంగె నన కోమలల - తాంగికి మహాశ్రీ!
సంగత మొనర్పను వె - లుంగ నవరత్నములు-
నీంగనలు పాడి రిల - మంగళ మహాశ్రీ!!

### హయప్రచారరగడ

అమరవంద్య! - యసురహంత!!
సమరవిజయ! - జయనియంత!!!

విమలచరిత! - విశదహృదయ!!
రమణమూర్తి! - రామ సదయ!!!

ఇతిశమ్

## ఉప సంహారము

### ద్విరదగతిరగడ

జయము రాములకును, వి - జయము సీతాసతికి!,
జయము సౌమిత్రికి వి, - జయము శ్రీమారుతికి,!!

జయము సుగ్రీవునకు - జయము ఋక్షపతి కగు!
జయము నంగదవిభీషణుల కగు శుభము దగు!!

రామరాజ్యము భువిని - రంజిల్లు చుండెడును,!
సామమార్గమున నే - జనము వర్తించెడును,!!

భామినీమణులకు న - భయ మెపుడు గల్గెడున,!
భూమి సత్ఫలములను - భూరి కల్పించెడును!!

స్వస్తి గలుగును; ప్రజా - స్వామ్యంబు వర్ధిల్లు!,
నిస్తులప్రేమయును - నిత్యము పరిఢవిల్లు.!!

### మరాళగతిరగడ

మానవజన్మఁడు రాముని ధర్మము-
మానవజాతికి నై సమర్పణము,!
మానవకథ యే రాముని కథ యిది
మానవజీవితమునకు దర్పణము.!!

### విజయభద్రరగడ

రామునకు సరి యైన నరవరుఁడు నరవరుఁడు, -
రామునకు సరియైన యట్టిడు ధవుఁడు దవుఁడు,!
రామునకు సరియైన అగ్రజుఁడు అగ్రజుఁడు,-
రామునకు సరియైన వాడే సుతుఁడు సుతుఁడు.!!

సౌమిత్రుఁ బోల వలెఁ దమ్ము డుండిన యెడల,-
స్వామి సేవకు వలయు మారుతికిఁ దగు భటుఁడు,!
భూమిజను బోలవలె భార్య యుండిన యెడల,-
భూమియందునను సుగ్రీవుడే తగు సఖుడు.!!

### మధురగతిరగడ

పావనమ్మైనది - బాడితి నీకథ!
పావని దయగొని - బాపర నా వ్యథ!!

గంగారాయని - మంగళహారతి!
పొంగుచు గొను హరి - పుంగవ! మారుతి!!

తత్సత్

**నం ధ ఖ**

కందశ్రీకారబంధము

రామచంద్రు రాజ్యము

వైరాగ్యము భక్తి గూడ - వరపాదుకల౯
ఆరాధించుచు భరతుడు
రారా జగు రాము పేర - రాజిల నేలె



శార్దూలచతుష్పథచతురస్రబంధము

శ్రీరామాకుచకుంకుమాశ్రితశుభ
శ్రీవత్సవక్షాన్వితా
శ్రీరామాయణ గాధ తా రగడగాఁ
జెన్నొంద గావించెనే
శ్రీరామార్పణ సేసె నే డొనర రా
జేశుండు నారాయణా
శ్రీరామా బలరావణాసురహరా
శ్రేయంబులం గూర్చుమా

## మధురగతిరగడగిరిధరకూర్మబంధము

సరస మధు మధుర - గిరగిరి ధరధర!
బిరబిరనర, నరహరి మము బ్రోవర!!



## హరిణగతి రగడ సృష్టి చక్రబంధము

నుతులు, వినుతులు, నతులు వినతులు
స్తుతులు బుధవిబుధసుమతులఁ గొను!
గతుడు, విగతుడు, రతుడు, విరతుడు
గతి, విగతి, నయు, వినయు, నను గను!!



## మధురగతిరగడ-నక్షత్ర బంధము

రారా రామా - రా సుకుమారా!

శూరా రాజసు - మా రా రారా!!



## ప్రవాళగతిశ్రేణీబంధము

శ్రీరామా జయరామా - శ్రితమారారీ వీరా!
హే! రామా సుకుమారా - హితమారా గంభీరా!!



# శ్రీరామ మంత్ర వ్యజన బంధము

శ్రీరామ జయరామ

జయజయరామ

మ 3, 7, 13



జ 4, 8, 10

రా 2, 6, 12 శ్రీ 1



య 5, 9, 11

## మంత్రత్రయ విహంగబంధము

1 ఓం నమో నారాయణాయ

2 ఓం నమః శివాయ




### హరిణగతిరగడ

అష్టాక్షరి యందలి 'రా' తోడ, వి-
శ్లిష్టము పంచాక్షరి 'మ' గలసె।
నిష్టం బగు రామమహా మంత్రము
సృష్టిని సర్వశ్రేష్ఠ మన వెలసె॥

ఓం హ్రీం శ్రీం రక్షామంత్ర
పుస్తక బంధము
ఓం హ్రీం శుభోదయం
ఓం శ్రీం సుఖోదయం



-: కృతికర్త కృతులు:-

1. రుక్మిణీ కల్యాణము — ముద్రితము
2. పార్వతీ విజయము — ముద్రితము
3. శ్రీమద్భగవద్గీతాగానము — ముద్రితము
4. పరీక్షిచ్చరితము — ముద్రితము
5. గంగా రూపకాలు — ముద్రితము
6. వేణు గోపాలశతకము — ముద్రితము
7. ఆత్మబోధ శతకము — ముద్రితము
8. హనుమద్విజయము — ముద్రితము
9. శ్రీ షిరిడీసాయి చరిత్ర — అముద్రితము
10. గంగా తరంగాలు — అముద్రితము
11. హరికథా గేయ గుచ్ఛము — అముద్రితము

*గ్రంథకర్త పితృదేవులు:*

**కీ.శే. గంగా లక్ష్మణ రాజేశ్వర కృతు**

1. రత్నకాంతనాటకము — ముద్రితము
2. కుచేలోపాఖ్యానము - హరికత — ముద్రితము
3. దండకారణ్య చరిత్ర — ఇవి కాల గర్భలీనములు
4. కృష్ణ దేవరాయ నాటకము — కాల గర్భలీనములు

*—: కృతి కర్త స్వీ కృతులు:—*

గౌడ రామాయణ - బాలకాండ

రచయిత

శ్రీతాటికొండ రాజగౌడు - మంథని